ఓం శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# పుణ్యాగానము

*ప్రతిపద్యమునకును లఘుటీకా-తాత్పర్యములతో*

**తాడేపల్లి లలితాబాలసుబ్రహ్మణ్యం**

**PUNYA-GAANAMU** (Telugu) : A centum of devotional quatrains addressed to Lord Sree Rama, describing his biography and exploits in brief.

By

**TADEPALLI LALITHA BALA SUBRAHMANYAM**
(TADEPALLI BALA SUBRAHMANYAM)

---



**Written :** 1982-83

**Published on-line :** November 2012.

Kali Era 5113 Nandana – Aswayuja - Krishnapaksham

**PRICE :** None for electronic downloads.

**Paper Edition :** Rs.25/ (Indian Rupees Twenty) only.

---

*PUBLISHED FROM HYDERABAD, ANDHRA, INDIA.*

---

ఓం శ్రీ రామచంద్రపరబ్రహ్మణే నమః

# పుణ్యగానము

---



**రామా ! రామా ! రా**
**మా ! రామా ! యనుచుఁ గోటి । మార్లనలేన–**
**క్కారణమున శతకముఁ జె**
**ల్వార వినీతుండ నగుచు । వ్రాసెద రామా !** 1

***లఘుటీక:*** *అక్కారణమునన్– ఆ కారణముచేత; చెల్వారన్ – అందమొలుకు నట్లుగా ; వినీతుండ నగుచున్ – వినయము గలవాఁడనగుచు.*

**తాత్పర్యము :** రామా! రామా! అని రామకోటి వ్రాయలేనఁ కనుక నీపయి పద్యములతో శతకమొక్కటి వ్రాసెదనని కవి శ్రీరామచంద్రునకు విన్నవించుకొనుచున్నాఁడు.

**కం. నీ నామకీర్తనంబును**
**మానిత సద్భావనార్ద్ర । మయఘనకవితా**
**లీనస్వభావపటిమం**
**బూను నరుఁడు భాగ్యశాలి । పుణ్యారామా !** 2

**లఘుటీక** : *మానిత....పటిమంబు – గౌరవనీయమైన మంచి భావములును, అర్థములును నిండిన గొప్పకవిత చెప్పుటయందే లీనమైన వ్యక్తిత్వదార్ఢ్యమును ; ఊను –పూను(వహించునట్టి) ; నరుఁడు– మనిషి ; పుణ్యా– పవిత్రుఁడా !*

**తాత్పర్యము :** ఓ రామా ! సదా నీ నామమును గీర్తించువాఁడును, గౌరవ నీయమైన భావార్థములు గల కవిత్వమును జెప్పుటయందే లీనమైనవాఁడును అగు మానిసియే ధన్యుఁడు.

**కం. సకలామరసంస్తోమము**
**సుకరంబుగ సన్నుతించి । సుకృతులు కా రె**
**ట్టి కవులయిన నీ నామం**
**బకళంక కవిత్వశక్తిc । బలుకక రామా !** 3

**లఘుటీక** : *సకల+అమర సంస్తోమమున్ – దేవతలందఱి సమూహమును ; సుకరంబుగన్– తేలికగా ; సన్నుతించి– పొగడి ; సుకృతులు – పుణ్యాత్ములు ; అకళంక కవిత్వ శక్తిన్– లోపములు లేని కవితాప్రావీణ్యముతో.*

**తాత్పర్యము :** ఓ రామా ! ఎంత గొప్పకవులైనను, నీ నామసంకీర్తనమునకై తమ కవితాశక్తిని వినియోగపఱుపక నీకంటె వేఱైన ఇతరదేవతలను స్తోత్రము చేసి ధన్యులు కాఁజాలరు.

**కం. నీ మాహాత్మ్యంబుల నీ**
**వే మానుగ వ్రాయఁదగిన । వే కవియును నీ**
**నామమహత్తును బూర్ణము**
**గా మెచ్చంజాలc డెందుc । గాంచిన రామా !** 4

**లఘుటీక** : *మానుగన్ – చక్కగా ; నామమహత్తును – నామమహిమను ; పూర్ణముగాన్ – పూర్తిగా ; మెచ్చన్ + చాలఁడు – స్తోత్రము చేయలేఁడు ; ఎందున్ + కాంచినన్ – ఎక్కడఁ జూచినను.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీ మహిమలెంత అసంఖ్యాకములును, అద్భుతములును, గంభీరములును ఐయున్నవనఁగా, వానిని సమగ్రముగా వ్రాయవలె నన్న అది నీకే చెల్లును. ఎంత గొప్పకవియైనను వానిని పూర్తిగా వర్ణింపఁజాలఁడు.

**కం. నిన్నింద జెన్నిరీతుల**
**బన్నం బొనరించినను స । ద్భావేదికలన్**
**సన్నుతులే యై సద్గ్రం**
**థోన్నత సత్కారమంది । తూఁగును రామా !** 5

**లఘుటీక** : *బన్నంబొనరించినను – అవమానము చేసినను ; సన్నుతులే – స్తోత్రములే ; సత్+గ్రంథ+ఉన్నత సత్కారము+ అంది – మంచిపుస్తకములకు తగిన సన్మానమును పొంది ; తూఁగును – ప్రాముఖ్యమును వహించును.*

**తాత్పర్యము :** ఓ రామా ! ని న్నవమానింపవలెనను దుర్బుద్ధితో ఎంతమంది నాస్తికులెన్ని పుస్తకములు వ్రాసినను, అవి నీ నామసంపర్కమును జెందుటచే సద్గ్రంథములకు రావలసిన గౌరవమును, ప్రఖ్యాతియు వానికి కూడ దక్కును. వైరము కూడ నొక భక్తిమార్గమే కదా !

**కం. నీ కథ వ్యాపించెఁ గద ! య**
**నేక విషయముల జనుల న । నేకోక్తుల, సీ !**
**నాకీ యాశ్చర్యంబే**
**లా ? కృతి యశమునకు నెల్ల । లబ్బునె ? రామా ! 6**

***లఘుటీక:*** *అనేక...జనులన్ – పెక్కుదేశములకుఁ జెందిన ప్రజలలో ; అనేక+ ఉక్తులన్– అనేకభాషలలో ; సీ – ఛీ ; ఏలా – ఎందుకు ; కృతి – పుణ్యాత్ముని ; యశమునకున్– కీర్తికి; ఎల్లలు– సరిహద్దులు ; అబ్బునె– పొందఁబడునా ?*

**తాత్పర్యము :** ఓ రామా ! అనేకదేశములలో, అనేకజాతులలో, అనేకభాషలలో నీ కథ వ్యాపించె నహో! అయినను నేనిట్లు ఆశ్చర్యపడుటెందుకు ? నీవంటి పుణ్యాత్ముని కీర్తికి దేశభాషాజాత్యాది పరిమితులు లేవు గదా స్వామీ !

**కం. కాలాకారుండ వవుట**
**నీ లీలలనంతములగు ; నిందున వాని**
**న్నాలింపఁగఁ గీర్తింపఁగఁ**
**జాలదు కాలంబు నిజము । జానకిరామా ! 7**

***లఘుటీక:*** *అవుటన్ – అగుట వలన ; ఇందునన్ – ఈ కారణముచేత; ఆలింపఁగన్ – వినుటకు.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీవు కాలమే ఆకారముగాఁ గలవాఁడవు కావున కాల మెంతవఱకుండునో అంతవఱకు నీ వవతారముల నెత్తుచునే యుందువు. అవతారములెత్తినప్పుడెల్ల నీ లీలలను మాకుఁ జూపుచునే యుందువు. కనుక



నీ లీలలు అనంతములు. ఈ కారణముచేత వానిని కీర్తించుటకు గానీ, వినుటకు గానీ కాలము సరిపోదు. ఈ మాట సత్యము.

**కం. ఏలా బహుకృతిపఠనం ?**
**బేలా యజ్ఞాదికర్మ ? లేలా యామ్నా**
**యాలాపము ? లొక్క భవ**
**ల్లీలాసల్లాపములె ని । లిచెడిని రామా ! 8**

***లఘుటీక :*** *బహుకృతిపఠనంబు– ఎక్కువ పుస్తకములను చదువుట ; ఆమ్నాయ + ఆలాపములు – వేదమంత్రములు ; భవత్ – నీ యొక్క ; లీలా – లీలలను గూర్చిన ; సంలాపములె – సరసపు గోష్ఠులే.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీ చరిత్రమే ఉండఁగా వేఱే పుస్తకములు పెక్కు చదువుట యెందుకు ? నీ పూజలుండఁగా వేఱే యజ్ఞాదికర్మలెందుకు ? నీ నామము ఉండఁగా వేఱే వేదమంత్రములెందుకు ? నీ లీలలను చర్చించుట వలన వచ్చు పుణ్యఫలమే నిలబడును గానీ తదితరములు కావు.

**కం. వ్రాసెదమెన్నియొ వ్రాఁతలు ;**
**చేసెదమెన్నియొ యసాధ్య । చేష్టలు వరుసన్ ;**
**వాసిగ నీ నామంబు ను–**
**పాసింపము మదిని మదము । పట్టఁగ రామా ! 9**

***లఘుటీక:*** *వాసిగన్ – నాణ్యముగా ; మదిని – మనస్సులో.*

**తాత్పర్యము :** ఓ రామా ! మేము మా లౌకికజీవితములో ఎన్ని పనులైనను

అలుపు–సొలుపు లేక చేయుచుందుము. వ్రాఁతలు వ్రాసెదము. ఇతరులకుఁ జేతఁగానటువంటి అసాధ్యచేష్టలు కూడ చేసెదము. కానీ మా మనస్సులను పొగరావహించుట చేత నాణ్యమైన నీ నామమును మాత్రము ఉపాసింపము. మా దురదృష్టమెట్టిదో కదా !

**కం. ఇడుములిడుములని యెల్లఱుఁ**
**గడు సంరంభంబు తోడ । గ్రందించెదరా**
**కడగండ్లన్నియు నీ పే**
**రుడుగక నిచ్చలు భజింప । కుండుట రామా !** 10

***లఘుటీక :*** *ఇడుములు – కష్టములు ; ఎల్లఱున్ – అందఱును ; కడున్ – మిక్కిలి; సంరంభంబుతోడన్ – ఆతురతతో ; క్రందించెదరు – ఆర్తనాదము చేసెదరు; కడగండ్లు– కష్టములు ; ఉడుగక– విడువక ; నిచ్చలు– ఎల్లప్పుడు ; భజింపకుండుటన్ – భజన చేయకుండుట వలన.*

**తాత్పర్యము :** ఓ రామా ! ప్రపంచజనులందఱును ఎల్లప్పుడు "కష్టములో... కష్టములో..." అని ఆతురతతో ఆర్తనాదములు చేయుచుందురు. నీ నామ కీర్తన మనునిత్యము విడువక చేయకుంటయే ఆ కష్టములన్నింటికి హేతువు.

**కం. కడగండ్లు సదా వచ్చును**
**గడవఁగలము మేము నీదు । కరుణ బలమునన్**
**విడువక ప్రోవుము మమ్మె**
**ప్పుడు సర్వమునీశ్వరౌఘ। పూజిత రామా !** 11



***లఘుటీక :*** *సదా – ఎల్లప్పుడు; కడవన్+కలము – దాఁటఁగలుగుదుము ; నీదు – నీ యొక్క ; ప్రోవుము – కాపాడుము ; సర్వముని+ఈశ్వర – గొప్ప మునులందఱి; ఓఘ – గుంపులచేత ; పూజిత – పూజింపఁబడువాఁడా !*

**తాత్పర్యము** : గొప్ప మునుల గుంపులచేత పూజింపబడువాఁడవైన ఓ రామా ! మానవులమగుట వలన మాకు నిరంతరాయముగా కష్టములు వచ్చుచునే యుండును. కాని యెన్ని వచ్చినను, నీ కరుణాసత్త్వము మా వెంట ఉన్నచో చాలును, మేము వానిని అవలీలగా దాఁటఁగలుగుదుము. అందుచేత నీ భక్తులమైన మా చేతుల నెల్లప్పుడును వదిలిపెట్టకుండ కాపాడవలసినది.

**కం. సేవింతు మహంకారము**
**వోవ, నఖిలలోకమాన । వోత్కరమును నిన్ ;**
**గావలసిన బాసట యి–**
**మ్మీవుండఁగ మాకిఁక భయ । మేలా ? రామా !** 12

***లఘుటీక :*** *అహంకారము – నేను అనెడి గర్వము మఱియు నాది అనెడి మమకారము ; వోవన్ (పోవన్) – పోవునట్లుగా ; నిన్ – నిన్ను ; అఖిల – అందఱు ; మానవ – మానవుల ; ఉత్కరమును – గుంపును ; సేవింతుము – సేవించెదము ; బాసట – సహాయమును ; ఇమ్ము – ఇవ్వుము; ఈవు – నీవు.*

**తాత్పర్యము :** ఓ రామా! మా అహంకార, మమకారములు పోయెడి విధము గా దేవుఁడ వైన నిన్ను, మఱియు మానవులను భక్తిశ్రద్ధలతో సేవించెదము.

ఇట్లు సేవించుటకు కావలసిన సహాయమును మాత్రమందిమ్ము. నీవుండఁగా మాకిఁక భయమెందుకు ?

**కం. సూదిం జొప్పింపఁగలము**
**వేదండ శతమును ; వేయి । వెలుఁగుల దొరలో**
**మోదంబున నుండఁగలము**
**నీదు దయాలేశమది జ । నించిన రామా !** **13**

***లఘుటీక :*** *నీదు – నీ యొక్క ; దయాలేశము+ అది – ఆ కొద్దిపాటి దయ ; జనించిన౯ – (మాయందు నీకు) కలిగినచో; సూది౯ – సూదిలో ; వేదండ శతమును – వేయి యేనుఁగులను ; చొప్పింప౯+కలము – దూరింపఁగలము ; వేయివెలుఁగుల దొరలో – సూర్యమండలములో ; మోదంబున౯ – సంతోషముతో ; ఉండ౯+కలము – నివసింపఁగలము ;*

**తాత్పర్యము :** ఓ రామా ! నీ దయయే అసాధ్యములను సుసాధ్యములుగా చేయుఁగలదు. అది నీకు మాయందు కలిగినచో, సూదిరంధ్రమునందు నూటేనుఁగులను దూర్పవచ్చును. భరింపరానంత అత్యుగ్రోష్ణము గల సూర్యమండలములో సహితము చల్లగా, సంతోషముగా కాలము గడుపవచ్చును.

**కం. కమలాసనాదినిర్జరు**
**లమలంబుగ వేఁడఁ గోస । లాధీశునకు౯**
**రమణీయక్రతువున జ**
**న్మము నొందిన నీకు మా న । మస్సులు రామా !** **14**



***లఘుటీక :*** *కమల+ఆసన+ఆది – పద్మమే ఆసనముగాఁ గల బ్రహ్మదేవుఁడు మొదలైన; నిర్జరులు – దేవతలు (ముదుసలితనము లేనివారు) ; అమలంబుగ౯ – నిర్మలమైన మనస్సుతో ; వేఁడ౯ – ప్రార్థింపఁగా ; కోసల+అధీశునకు౯ – కోసలదేశపు రాజైన దశరథునికి ; రమణీయ – అందమైన ; క్రతువున౯– పుత్రకామేష్టియాగము మూలమున ; జన్మము౯ – పుట్టుకను ; ఒందిన – పొందిన ; నీకు౯– నీకు; మా – మా యొక్క ; నమస్సులు – నమస్కారములు.*

**తాత్పర్యము :** ఓ రామా ! బ్రహ్మ మొదలైన దేవతలు లోకకల్యాణార్థమై ప్రార్థింపఁగా కోసలరాజయిన దశరథునికి పుత్రకామేష్టియాగమున కౌసల్యయందు జన్మించిన నీకు మా నమస్కారములు.

**కం. ద్యోతలగతోషధీశునిఁ**
**జేతం బెట్టుమని యడిగి । చెలువముగా నీ**
**చేతి ముకురమునఁ జంద్రు ము**
**దాతిశయంబున గను నినుఁ । దలఁచెద రామా !** **15**

***లఘుటీక :*** *ద్యోతల – ఆకాశమండలమునందు ; గత – ఉన్న ; ఓషధీశుని౯ – చంద్రుని ; చేత౯ – నీ చేతిలో ; ముకురమున౯ – అద్దములో ; చెలువముగా౯ – అందముగా ; ముద+ అతిశయమున౯ – పెల్లుబికిన ఆనందముతో ; తలఁచెద౯ – ధ్యానించెదను.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీ శైశవమునం దొకమారు నీ వాకాశములో నున్న

చంద్రుని జూచి, "ఆ జాబిల్లి కావలె"నని చెప్పి యేడ్చితివి. అప్పుడు మీ తల్లి గారైన కౌసల్య నీ చేతికొక అద్దమిచ్చి అందులో చంద్రుని చూపఁగా *"చంద్రుడు చేతికి చిక్కినాఁ"* డనుకొని సంతసించితివి.అట్టి నీ శైశవ మౌగ్ధ్యమును పదేపదే తలఁచుకొందును.

**కం. క్రతుసంరక్షణమునకై**
**యతిదూరమునుండి వచ్చి । యడిగిన మునితో**
**సుతులం బనుప దశరథుం**
**డతనిని గూడి చను నిన్నుఁ । దలఁచెద రామా !** **16**

***లఘుటీక*** *: క్రతు – యజ్ఞములను ; సంరక్షణమునకై – కాపాడుట కొఱకు ; సుతులన్ –కొడుకులను ; పనుపన్ – పంపఁగా ; కూడి – కలిసి ; చను – వెడలు.*

**తాత్పర్యము :** ఓ రామా ! విశ్వామిత్రుఁడనెడి బ్రహ్మర్షి తాను చేయుచున్న యాగమొకటి మాటిమాటికి రాక్షసులచేత భగ్నమగుచుండఁగా "దానికి రక్షణ కావలె" నని మీ తండ్రిగారైన దశరథమహారాజు కడకు వచ్చి అభ్యర్థించెను. అప్పుడాయన తన కొడుకులను అందుకు నియోగించెను. అంతట నీవు నీ తమ్ముఁడైన లక్ష్మణునితో కలిసి యాగరక్షణమునకై విశ్వామిత్రునివెంట వెడలి నావు. అటువంటి నిన్ను ధ్యానించెదను.

**కం. చిత్రకములు వెనుజూపఁగఁ**
**బత్రకములు రాలిపడఁగ । భయకరియై రాఁ**
**జిత్రాకృతిఁ దాటక ముని–**



**మిత్రమువై కెడపు నిన్ను । మెచ్చెద రామా !** **17**

***లఘుటీక*** *: చిత్రకములు– పులులు; వెనుజూపఁగన్– భయముతో వీఁపుఁ జూపి పారిపోవుచుండఁగా; పత్రకములు– ఆఁకులు; భయకరి– భయమును గలిగించు స్త్రీ ; చిత్ర+ఆకృతిన్ – విడ్డూరమైన వికటదేహముతో ; కెడపు – చంపిన.*

**తాత్పర్యము** : ఓ రామా ! విశ్వామిత్రుని వెంట ఆయన ఆశ్రమమునకు పోవు నప్పుడు దారిలో 'తాటక' అను రాక్షసస్త్రీ మీకు తారసిల్లినది. ఆమె ఆకస్మికము గా నచ్చటికి వచ్చిపడిన ధాటికి పులులు కూడ పారిపోయినవి. చెట్ల ఆఁకులు రాలిపడినవి. అంతట విశ్వామిత్రు నాజ్ఞానుసారముగా మునులకు హితము చేయువాఁడ వై నీవామెను వధించితివి. అట్టి నిన్ను ప్రశంసించెదను.

**కం. సానుజుఁడవైన నీకుం**
**బూని యనేకాస్త్రశస్త్ర । ములు ముని కఱపం**
**గా నాసక్తిఁ గఱచుచును**
**వానిమెయిన్ వెలుఁగు నీకు । వందన రామా !** **18**

***లఘుటీక*** *: స+అనుజుఁడవు – తమ్మునితోఁ గూడియున్నవాఁడవు ; పూని – పూనుకొని (చొఱవ తీసుకొని) ; కఱపంగాన్ – నేర్పఁగా ; కఱచుచున్ – నేర్చుకొనుచు ; వానిమెయిన్ – వానితో (అస్త్రశస్త్రములతో) ; వెలుఁగు – ప్రకాశించు ; వందన – వందనము.*

**తాత్పర్యము** : ఓ రామా ! అప్పుడా విశ్వామిత్రుఁడు సంతసించి నీకును, నీ

తమ్ముఁడైన లక్ష్మణునికి అనేకాస్త్రశస్త్రముల ప్రయోగోపసంహారాదికములనం ఉపదేశించెను. వాని జ్ఞానముతో నీవు మిక్కిలి ప్రకాశించినావు. అట్టి నీకు వందనము.

**కం. తలఁగక విశ్వామిత్రుని**
**వలనన్ వామనచరిత్ర । వైనంబెల్లన్**
**దెలిసికొని గాధిసుతమఖ**
**విలయంబును నిలుపు నీవె । వీరుఁడు రామా ! 19**

***లఘుటీక*** *: తలఁగక – ఎడఁబాయక ; వైనంబు – విధానము ; ఎల్లన్ – మొత్తమును ; గాధిసుత – గాధిమహారాజు యొక్క కుమారుఁడైన విశ్వామిత్రుని ; మఖ – యజ్ఞపు ; విలయంబును – విధ్వంసమును ; నిలుపు – ఆపివేసిన.*

**తాత్పర్యము :** ఓ రామా! పిదప నీవు మీ గురుఁడైన విశ్వామిత్రుని వెంటనంటి మసలుచు ఆయన నుండి వామనావతారకథను శ్రద్ధగా ఆలకించితివి. తరువాత ఆయన ఆశ్రమమునకుఁ జేఱుకొని, అచ్చట రాక్షసులను దునుమాడి, ఆ యాగవిధ్వంసమును ఆపి అది నిర్విఘ్నముగా జఱుఁగునట్లు చూచితివి. అట్టి నీవే మహావీరుఁడవు.

**కం. మిథిలకుఁ బోవుచుఁ గడచిన**
**కథలాలించుచును గౌశి । కాస్యము వలన**
**రథవాహనరహితంబుగ**
**మిథిల సమీపించు నీకు । మెప్పులు రామా ! 20**



***లఘుటీక*** *: కడచిన కథలు– ప్రాచీనకాలములో జఱిగిపోయిన వృత్తాంతములు ; ఆలించుచును – వినుచు ; కౌశిక + ఆస్యము వలనన్ – విశ్వామిత్రుని ముఖము ద్వారా ; రథ వాహనరహితంబుగన్ – రథములవంటి బండ్లేవియు లేకుండనే ; మెప్పులు – ప్రశంసలు.*

**తాత్పర్యము :** ఓ రామా ! అట్లా యాగము పరిసమాప్తి నొందిన వెనుక విశ్వామిత్రునితో కలిసి కాలినడకన మిథిలకు పోవుచు, దారిలో ఆయననోట పెక్కు పురాణకథలను వినుచు తుదకా నగరమునకు చేఱుకొంటివి. అట్టి నీకు స్తోత్రములు.

**కం. ఆ మిథిలలో శతానం**
**దామిత విఖ్యాతఋషివ । దనమున ముని వి**
**శ్వామిత్రపవిత్రచరి**
**త్రామోదముఁ జూచు నిన్నుఁ । దలఁచెద రామా ! 21**

***లఘుటీక*** *: శతానంద –శతానందుఁడను ; అమిత – మిక్కిలి ; విఖ్యాత – ప్రసిద్ధుఁడైన ; ఋషి –తపస్వియొక్క ; వదనమున – నోటినుండి ; ముని – మునియైన ; విశ్వామిత్ర – విశ్వామిత్రుని ; పవిత్రచరిత్ర – పుణ్యాచరిత్ర అను ; ఆమోదమున్ –సువాసనను ;*

**తాత్పర్యము :** ఓ రామా ! మిథిలకు చేఱుకొన్న వెనుక అట శతానందుఁడను ఋషి మీకు కలిసెను. ఆయన సాక్షాత్తు అహల్యాగౌతముల కొడుకే. ఆయన మీ గురువైన విశ్వామిత్రుని పవిత్రచరిత్రమును మీకు సాకల్యముగా చెప్పఁగా

నీవా కథలోని మధురపరిమళము నాస్వాదించితివి.అట్టి నిన్ను ధ్యానించెదను.

**కం. తన తల్లిజారతయును బి**
**తృనిదేశాగతశిలాత్వ । దుర్దశ నీ స్ప**
**ర్శనఁ బాపినందుకా ముని**
**వినుతులు గను నీ యశంబు । విందును రామా ! 22**

***లఘుటీక :*** *జారతయును – వ్యభిచారదోషమును ; పితృ – తండ్రి యొక్క ; నిదేశ – ఆజ్ఞ చేత ; ఆగత – వచ్చిన (సంప్రాప్తించిన) ; శిలాత్వ – ఱాతి స్థితి అనెడి ; దుర్దశన్ – దుర్గతిని ; నీ – నీ యొక్క ; స్పర్శనన్ – తాఁకు చేతనే ; పాపినందుకున్– పోఁగొట్టినందుకు ; ఆ ముని– ఆ మునియొక్క ; వినుతలు – పొగడితలు ; కను – పొందిన ; నీ యశంబున్ – నీ గొప్పతనమును గూర్చి ; విందును – వినెదను.*

**తాత్పర్యము :** ఓ రామా ! ఆ సందర్భములోననే, మీరు వచ్చుచున్న దారిలో నీ కాలికి తగిలిన ఒక పెద్దఱాయి తనతల్లియైన అహల్యగా మారి, భర్త గౌతమ మహర్షి యిచ్చిన శాపమును పోగొట్టుకొనెనని ఆ శతానందుఁడు వినెను. విని, నిన్ను స్తోత్రము చేసెను. అంతటి మహర్షిచేత చిఱుతప్రాయముననే ఘనముగా పొగడఁబడుట వలన నీ కీర్తిని గుఱించి వినుట నాకభీష్టము.

**కం. ఏనూర్వుఱు శూరులచేఁ**
**బూనఁబడిన పూతమైన । భూతవిభుని విల్**
**కైనూని విఱిచివైచిన**



**మానితబలశాలి నిన్ను । మఱువను రామా ! 23**

***లఘుటీక :*** *ఏనూర్వుఱు– ఐదువందలమంది ; పూనఁబడిన – మోయఁబడిన ; పూతమైన – పవిత్రమైన ; భూతవిభుని – శివునియొక్క ; విల్ – వింటిని ; కైన్ – ఒక్కచేతితో ; ఊని – పట్టుకొని ; విఱచివైచిన – విఱిచివేసిన ; మానిత – గౌరవింపఁదగిన.*

**తాత్పర్యము :** ఓ రామా ! పిమ్మట జనకమహారాజు తన కూఁతురైన సీతాదేవికి ప్రకటించిన స్వయంవరమును జూచుటకై మీరందఱును వెడలితిరి. ఆ రాజునకు తన తాతతండ్రుల వలన శివధనుస్సొకటి సంక్రమించియుండెను. "దాని నెత్తినవానికే సీతనిచ్చి వివాహము చేసెద" నని ఆ రాజంతకు మున్ను ప్రకటించి యుండెను. దానిని ఐనూర్వుఱు (500) వీరులొక బండిపై పెట్టుకొని త్రోసికొనుచు అచ్చటకు తెచ్చిరి. దాని నెత్తుటకే అక్కడ నున్న రాజకుమారులకు అలవి కాదయ్యెను. అప్పుడు నీవు మీ గురువైన విశ్వామిత్రుని ఆజ్ఞను శిరసావహించి, దాని నొక్కచేతితో ఎత్తి, ఎక్కుపెట్టితివో లేదో, అది వెంటనే విఱిగి రెండువుక్కలైనది. కనుక నీ బలము మిక్కిలి సంభావనీయమైనది. అట్టి నిన్ను మఱువకుండ ఎల్లప్పుడును స్మరించెదను స్వామీ !

**కం. తమ్ములు గూడఁగ సత్రే**
**మమ్మున వైదేహి హస్త । మంది జనుల కన్**
**దమ్ముల కుత్సవముల నం**
**దమ్ముగఁ గావించు నిన్నుఁ । దలఁచెద రామా ! 24**

***లఘుటీక :*** *తమ్ములు + కూడఁగ – నీ తమ్ములైన లక్ష్మణ, భరత, శత్రుఘ్ను*

*లు కూడ నీతో కలువఁగా ; వైదేహి హస్తము – సీతమ్మచేతిని ; అంది – పట్టు కొని ; కఙ్+తమ్ములకుఙ్ – కన్నులనెడి తామరపూలకు (తామరపూలవలె అందముగా నున్న కన్నులకని భావము) ఉత్సవములఙ్– వేఁడుకలను; కావిం చు –చేయునట్టి.*

**తాత్పర్యము :** ఓ రామా ! తన కూఁతును నీకే యిచ్చిచేయుటకు జనక మహా రాజు నిశ్చయించి ఆ వార్త దశరథునకు వర్తమానమంపెను. దశరథుఁడును తన భార్యలతోడను, భరత శత్రుఘ్నులతోడను, మంత్రి, సేనాని, సామంత పురోహితాది ఇతర పరివారముతోడను మిథిలకు తఱలివచ్చెను. అప్పుడు నీవు సీతాదేవిని పరిణయమాడఁగా, నీ తమ్ములు సీతమ్మ చెల్లెండ్రను మనువా డిరి. అట్లు మీరంద ఱేకకాలముననే వివాహమగుట ప్రజకు కన్నులపండువ య్యెను. అట్టి నిన్నెల్లప్పుడును మననము చేసికొందును దేవా !

**కం. భార్గవుఁ డంకింపఁగ ని**
**రర్గళ దోస్సారమునఁ ద । దస్త్రాసనముఙ్**
**భర్గధనుస్సును వలెనే**
**వర్గించిన నీకు స్తోత్ర । వచనము రామా ! 25**

***లఘుటీక*** *: భార్గవుఁడు– భృగుమహర్షివంశమున జన్మించిన పరశురాముఁడు ; అంకింపఁగఙ్ – అడ్డుపడఁగా : నిర్+అర్గళ – గొళ్ళెము (అడ్డు) లేని ; దోః + సారమునఙ్ – బాహువుల బలముతో ; తత్ + అస్త్రాసనముఙ్ – వింటిని ; భర్గ – శివునియొక్క ; ధనుస్సును వలెనె– వింటిమాదిరిగానే ; వర్గించిన –*



*విఱఁగొట్టిన.*

**తాత్పర్యము :** ఓ రామా ! పెండ్లిండ్లయిన వెనుక మీరందఱును అయోధ్యకు బయలుదేఱితిరి. అప్పుడు దారిలో పరశురాముఁ డెదురై, "హే రామా ! శివ ధనుస్సును విఱచుట కాదు. నా దగ్గఱ నున్న యీ విష్ణుధనుస్సును చూడు ము. ఇది శివధనుస్సునకంటెను మిక్కిలి గొప్పది. కావున చేతనైనచో దీని నెక్కు పెట్టి వీరుఁడ వనిపించుకొనుము. లేదా నాతో ద్వంద్వయుద్ధమునకు సిద్ధము కమ్ము" అని స్పర్థించెను. అప్పుడు నీవా ధనుస్సును కూడ చేతిలోనికి తీసి కొనఁ గా అదియు శివధనుస్సువలెనె ముక్కలైపోయినది. అంతట ఆ పరశు రాముఁడు సిగ్గుచెంది, నీవు సాక్షాత్తు విష్ణుమూర్తివని గ్రహించి, తపస్సుచేసి కొనుటకై మహేంద్రగిరులకు వెడలిపోయెను. అంతటివానికి గర్వభంగము చేసిన నీకు మా స్తోత్రవచనములు.

**కం. దశరథుఁడు ప్రియంబారఁగ**
**నశనిప్రాయమగు రాజ్య । మమలుఁడవగు నీ**
**సుశయమునఁ నుంపఁజూచుట**
**విశుద్ధమతి నాయనను స్త । వింతును రామా ! 26**

***లఘుటీక :*** *ప్రియంబు+ఆరఁగఙ్ – ఇష్టము వెల్లడియగునట్లు : అశనిప్రాయ మగు – ఇంద్రుని వజ్రాయుధముతో సమానమగు ; అమలుఁడవు+అగు – పరిశుద్ధుఁడవగు; సు+శయమునఙ్– శుభకరమైన చేతిలో; ఉంపఙ్చూచు టఙ్ – పెట్టుటకు ప్రయత్నించుటవలన ; విశుద్ధమతిఙ్ – నిర్మలమైన మన*

*స్తుతో ; స్తవింతును – స్తోత్రము చేయుదును.*

**తాత్పర్యము :** ఓ రామా! వజ్రాయుధమువంటి రాజ్యాధికారమును నీ శుభకరమైన చేతిలో పెట్టఁజూచి, నీయందు తనకున్న ప్రేమమును వెల్లడి చేసినందున నీ తండ్రియైన దశరథమహారాజును నిర్మలమైన మనస్సుతో స్తోత్రముచేయుదును.

**కం. మునుకొని కైకకు "నీ నా**
**థునిఁ బ్రాగ్దత్తవరముల న । డుగు" మనుచుఁ దా**
**నొనరుప మంథర దుర్బో**
**ధన, మట్టులె చేయు కైక । తల్లియె రామా ? 27**

***లఘుటీక :*** *మునుకొని – పూని (ప్రయత్నించి) ; ప్రాక్+దత్త వరములన్ – పూర్వమివ్వఁబడిన వరములను ; ఒనరుపన్ – చేయఁగా ; దుర్+బోధనము – చెడు చెప్పుళ్ళు ; అట్టులె – ఆ విధముగానే ; తల్లియె – తల్లియేనా ?*

**తాత్పర్యము :** ఓ రామా ! అప్పుడు నీ పట్టాభిషేకవార్త విని అసూయఁజెందిన మంథర యను ముదుసలిదాసి కైకను సమీపించి, "మున్నొకమారు దేవాసుర యుద్ధములో సహాయము చేసినందుకు దశరథమహారాజు నీకిచ్చెదనని వాగ్దానము చేసిన ఆ రెండువరములను ఇప్పుడడుగుము. ఒకటి, భరతునికి పట్టాభిషేకము. రెండవది శ్రీరాముని వనవాసము." దాని మాటలువిని కైక దశరథునట్లే అడిగెను. అట్టి కైక నీకు తల్లి యెట్లగును స్వామీ ?

**కం. తన కపచయంబును దలం**



**చిననైనం గీడరయక । శేషితలను బో**
**లెను గైకఁ గూడ సెలవడి**
**గిన నీ మర్యాద నేర్వఁ । గ్లిష్టము రామా ! 28**

***లఘుటీక :*** *అపచయమును – అపకారమును : తలంచిన నైనన్ – సంకల్పించినను; కీడు+అరయక– తప్పుపట్టక ; శేషితలను బోలెను– మిగత తల్లులను వలెనె ; సెలవడిగినన్ – వెడలివచ్చెదనని అనుమతి అడిగిన ; నేర్వన్+ క్లిష్టము – నేర్చికొనుట కష్టము.*

**తాత్పర్యము :** ఓ రామా ! కైకకిచ్చిన వరముల చొప్పుననే దశరథుఁడు భరతునికి పట్టాభిషేకము జేయఁ సంకల్పించి ని న్నడవులకు పొమ్మనెను. పితృవాక్య పరిపాలకుఁడవైన నీవాయన మాట కెదురాడక తత్షణమే అందుకు సమ్మతించితివి. అట్లు వెడలఁబోవుచు నీ శ్రేయోఽభిలాషిణులైన కౌసల్యను, సుమిత్రను అడిగినట్లే నీకు రాజ్యము లేకుండ చేసి అడవులకు వెడలనడచిన కైకను గూడ సెలవడిగితివి. ఆహా ! నీది యెంత మర్యాద ! అది నేర్చికొనుట మము బోంట్లకు చాల కష్టము దేవా !

**కం. సతి కోరిన వైఖరి నిజ**
**వితరణశీలంబు లోక । విదితము కాఁగాఁ**
**జతురత లేకిచ్చి దివం**
**గతుఁడైన దశరథు జాలిఁ । గందును రామా ! 29**

***లఘుటీక :*** *సతి– ధర్మపత్ని ; కోరిన వైఖరిన్– అడిగిన విధముగా; వితరణ శీలము – ఉదారత్వము (దానగుణము) ; లోకవిదితము – ప్రపంచమునకు తెలి*

*సినది; చతురత లేక– తెలివితేఁటలు లేకుండ; దివంగతుఁడు– మృతుఁడు ; జాలిన్ – కారుణ్యముతో ; కందును – చూచెదను.*

**తాత్పర్యము :** రామా! దశరథుఁడు కైకకు తానిచ్చిన మాట నిలఁబెట్టుకొనుట లో తన ఔదార్యము వెల్లడి యగునట్లు, పెద్దగా ఆలోచింపకయే *(చతురత లేక)* ఆమెకు వరములనిచ్చి ఆ బాధతో పరలోక గతుఁడయ్యెను. ఆయన పరిస్థితికి నే నాయనపై జాలిపడెదను దేవా !

**కం. ఆ వరముల యిట్టలపుఁ బ్ర**
**భావంబున రాచఱికము । భరతునిఁ జేరన్**
**గ్రేవలు బట్టి సుపుత్త్రక**
**భావంబున నేఁగు నీకుఁ । బ్రణతులు రామా !** **30**

***లఘుటీక :*** *ఇట్టలపున్ – మహత్తరమైన ; రాచఱికము – వంశపారంపర్య రాజత్వము ; భరతునిన్ + చేరన్ – భరతునికి చెందఁగా ; క్రేవలు + పట్టి – నానాదిక్కులను అవలంబించి ; సుపుత్త్రకభావంబునన్ – ఒక మంచి కొడుకునకు ఉండఁదగిన గుణముతో; ఏఁగు– వెడలిపోయిన; ప్రణతులు– ప్రణామములు.*

**తాత్పర్యము :** ఓ రామా ! దశరథుఁడు తన మూఁడవ భార్య కొసంగిన ఆ మహత్తర వరముల ప్రభావముచే రాజత్వమింక భరతునిదయ్యెను. అంత నీవు పితృవాక్యపరిపాలకుఁడగు ఒక మంచి కొడుకున కుండఁదగిన స్వభావముతో దొఱికిన దిక్కునుబట్టి అడవులకు వెడలితివి. అట్టి నీకు మా ప్రణామములు ప్రభూ !



**కం. భవదీయదుస్సహామే**
**య విరహవిజ్ఞానిని యగు । నవనిజయున్ నీ**
**కవనై వత్తుననంగాఁ**
**బ్రవచించియు నొప్పు నీకుఁ । బ్రార్థన రామా !** **31**

***లఘుటీక :*** *దుస్సహ – భరింప శక్యము కానటువంటి భవదీయ – నీ యందలి ; అమేయ – అంతులేని : విరహ– విరహబాధను గూర్చి; విజ్ఞానిని + అగు – తెలిసినదైన ; అవనిజయున్ – సీత కూడ ; నీ కవనై – నీకు జంటగా ; ప్రవచించియున్ – వలదని వారించియు ; ఒప్పు – ఒప్పుకొన్న.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీవొక్కఁడవే అడవికి వెడలిన పక్షమునఁ దనకుఁ గలుగఁగల విరహబాధను గూర్చి మున్నే యెఱిఁగినదై, నీ యెడఁబాటు సైపఁ జాలని జానకి, "నేను కూడ నీతో వచ్చెద" నని పలికెను. నీవు వలదని వారించుచు హితోపదేశముఁ గావించితివి. అయినను ఆమె ప్రార్థనకు కరిగి పిమ్మట సమ్మతించితివి. అట్టి నీకు మా వేఁడికోలు.

**కం. పౌరులెవని కనుగతులై**
**నారో నెంజిట నెవనికి। నై యేడ్చెనొ య**
**ద్ధారుణివిభుండు దశరథుఁ**
**డా రాకేందుముఖు నిన్నుఁ । దలఁచెద రామా !** **32**

***లఘుటీక :*** *అనుగతులు – వెంట వచ్చినవారు ; నెంజిటన్ – బాధతో ; ఎవనికి*

*నై – ఎవఱి కొఱకు ; ఆ +ధారుణీవిభుండు – ఆ రాజు ; రాకేందుముఖున్ – పున్నమినాఁటి చంద్రునిఁ బోలిన ముఖము కలిగినవానిని.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీవు రాజ్యాభిషేకమునకు నోఁచుకొనక తాపసివలె నారచీరలు గట్టి అడవులకు పోవుచుండఁగా నిన్ను వీడి ఉండలేని అయోధ్యా పౌరులు నిన్నే అనుగమించిరి. నీతండ్రి దశరథుఁడును తానొక రాజనను ధీరత్వమును కోల్పోయి నీ కొఱకేడ్చెను. ఇట్లు పున్నమినాఁటి చంద్రునివలె అందఱికిని ప్రియతముఁడవైన నిన్ను ధ్యానించెదను.

**కం. ఆదరమారఁగ నెవ్వని**
**నాదారానుజముగ నది । కటు దాఁటించెన్**
**సాదితపుణ్యుండు గుహుం**
**డా దురితవినాశు నిన్నుఁ । దలఁగను రామా ! 33**

***లఘుటీక*** *: ఆదరము+ఆరఁగ – అభిమానము బయల్పడునట్లుగా ; ఆదార+ అనుజముగ – భార్య మఱియు తమ్మునితో సహా ; అటు దాఁటించెన్ – ఆవలి యొడ్డునకు దాఁటించెనో; సాదితపుణ్యుండు– పొందఁబడిన పుణ్యము గలవాఁడు; దురిత– పాపములను; వినాశున్ – నాశనము చేయువానిని ; తలఁగను – వదిలి ఉండను.*

**తాత్పర్యము :** ఓ రామా ! అడవులకు పోవు దారిలో నీవు నదిని దాఁటఁగోరఁగా నీ తొల్లింటి చెలికాఁడైన గుహుఁడను బెస్తవాఁడు నిన్ను నీ భార్యయైన వైదేహి తోడను, తమ్ముఁడైన లక్ష్మణునితోడను తన పడవలో కూర్చుండఁబెట్టు



కొని, నదిని దాఁటించి పుణ్యమార్జించినవాఁడయ్యెను. ఇట్లు సేవాభాగ్యమును అనుగ్రహించుట ద్వారమున పాపములను పోఁగొట్టి పుణ్యములను ప్రసాదించు నిన్ను వీడను స్వామీ !

**కం.అమలద్యుతిస్ఫురచ్ఛిఖ**
**రములుం బ్రవహద్విపుల ఝ । రములుఁ గలిగి ధీ**
**శమనమగు చిత్రకూటపుఁ**
**గొమరుఁ బ్రశంసించు నిన్నుఁ । గొలిచెద రామా ! 34**

***లఘుటీక*** *: అమల– నిర్మలమైన; ద్యుతి– కాంతితో ; స్ఫురత్– మెరయుచున్న ; శిఖరములున్ – కొండకొమ్ములును ; ప్రవహత్ – ప్రవహించుచున్న ; విపుల – వెడల్పాటి ; ఝరములున్ – ఏర్లును ; ధీ – మనస్సునకు ; శమనము+ అగు – శాంతిని కలిగించునట్టిదగు ; చిత్రకూటపున్ – చిత్రకూటమనెడి పర్వతము యొక్క ; కొమరున్ – సౌందర్యమును.*

**తాత్పర్యము :** ఓ రామా ! మీరు మొదట చిత్రకూటపర్వతమునకు చేఱం కొనిరి. దాని శిఖరములు నిర్మలకాంతిమయములు. దాని యొక్క సానువుల నుండి సెలయేర్లు పెక్కులు ప్రవహించుచుండెను. చిత్తోపశాంతికరమైన ఆ పర్వత సౌందర్యమును నీవప్పుడు మిక్కిలి ప్రశంసించితివి. అట్టి నిన్ను సదా ఉపాసింతును ప్రభూ !

**కం. జైమిని సెప్పిన నాస్తిక**
**సామంబుల నృక్కరించి । సాధుపథంబున్**

**ధీమంతుఁడవై నొడివిన**
**నీ మతివైశాల్య మగణ । నీయము రామా !** 35

***లఘుటీక :*** *నాస్తిక సామంబుల్ – దేవుఁడు లేఁడనియు, ధర్మశాస్త్రములెల్ల బూటకములనియు, అంతా మానవకల్పితమే అనియు, కన్నులకు కనపడు నదియే నిజమనియు నచ్చఁజెప్పునట్టి మెత్తని మాటలను ; న్యక్కరించి – తిరస్కరించి ; సాధుపథంబుర్ – సత్పురుషుల మార్గమును ; ధీమంతుఁడవై – బుద్ధిశాలివై ; నొడివిన– ప్రవచించిన ; మతివైశాల్యము– విశాల మేధాశక్తి ; అగణనీయము – ఇంతింతని లెక్కపెట్టరానిది.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీవట్లు రాజ్యమును వదలివేయుట ఇష్టములేని జైమిని అను రాజపురోహితుఁ డొకఁడు నిన్ను రహస్యముగా కలిసి, "జ్యేష్ఠుఁడ వగుట వలన రాజ్యాధికారము నీదియే. మీ తండ్రిని లక్ష్యపెట్టవలదు. అందు వలన పాపమేమియు సిద్ధింపదు. నిజమునకు పాపపుణ్యములన్నవి మిథ్య. ఇహలోకమే పరమసత్యము" అని బోధింపఁబోయెను. నీవాయన మాటలను ఖండించి నీ ధర్మబుద్ధి చొప్పుననే నడచుకొంటివి. నాస్తికత్వమును ఖండించిన నీ మేధాశక్తి అపారము స్వామీ !

**కం. ధరణిర్ నీకీవచ్చిన**
**భరతు వలన జనకు మరణ । పథమెఱిఁగి మహ**
**త్తరశోకభరమ్మున ను**
**త్తరక్రియల జఱుపు నిన్నుఁ । దలఁచెద రామా !** 36

***లఘుటీక:*** *ధరణిర్ – భూమిని (రాజ్యమును) ; నీకు+ఈర్+వచ్చిన – నీ కిచ్చుటకై వచ్చిన ; జనకు– తండ్రియొక్క ; మరణపథము – చనిపోయిన విధమును ; ఎఱిఁగి– తెలిసికొని ; మహత్తర– గొప్పదైన ; శోకభరమ్మునర్– దుఃఖభారముతో ; ఉత్తరక్రియలర్– శ్రాద్ధాది అంత్యక్రియలను ; జఱుపు – జఱిగించిన (నిర్వ హించిన).*

**తాత్పర్యము :** ఓ రామా ! మీరు ఆ చిత్రకూటపర్వతమునం దున్నప్పుడు నీ తమ్ముఁడయిన భరతుఁడు మంత్రులతోడను, పౌరప్రముఖులతోడను కలిసి నిన్ను రాజ్యాభిషేకమున కొప్పించు నుద్దేశముతో అచ్చటకు వచ్చెను. మీతండ్రి యైన దశరథమహారాజు చనిపోయెనని ఆతని ద్వారముననే నీవు వింటివి. విని చాల శోకించి, పిమ్మట యథావిధిగా ఆయన కూర్ధ్వదైహికక్రియలు జఱి పితివి. అట్టి నిన్ను సదా స్మరించెదను.



**కం. "నందిగ్రామంబున నే**
**నుందును త్వదుపానహముల । ని"మ్మను తమ్ముర్**
**స్యందితకరుణం గని యా**
**నందింపంజేయు నిన్ను । నరయుదు రామా !** 37

***లఘుటీక :*** *త్వత్ +ఉపానహముల్ర్– నీ పాదుకలను ; ఇమ్ము + అను – ఇవ్వు మని అడుగునట్టి; స్యందిత– ప్రవహించిన; కని –చూచి ; అరయుదుర్ – చూచెదను.*

**తాత్పర్యము :** ఓ రామా ! నిన్ను భరతుఁడెంత వేఁడినను పితృనిదేశమునకు విరుద్ధముగా పట్టముఁ గట్టుకొనుటకు నీవిష్టపడవైతివి. కాని నిన్ను తోడ్కొనక

అయోధ్యకు తానొక్కఁడే మఱలిపోవుటకు భరతుఁడును ఇచ్చగింపఁడయ్యె. తుదకు, "అన్నా ! నీవు రాకున్నచో నీ పాదుకలనైనను నాకిమ్ము. వాని పేరిటనే సకలవ్యవహారములను చూచుకొనుచు నీవు మఱలివచ్చునందాఁక నందిగ్రామమున నివసించెద" నని పలికెను. అంతట నీవాతని ప్రార్థన కామోదించి, నీ పాదుకలొసంగి ఆనందింపఁజేసితివి. అట్టి నిన్ను నా మనస్సులోనే దర్శనము చేసికొందును స్వామీ !

**కం. పరువడి యత్రిమహాముని**
**వరు నాశ్రమదేశమునకు । వచ్చి మునివచో**
**నిరతి న్నకళంకుఁడవై**
**తఱివోవం బుచ్చు నిన్నుఁ । దలఁచెద రామా ! 38**

***లఘుటీక*** *: పరువడి – మఱల ; ఆశ్రమదేశమునకున్ – ఆశ్రమమున్న చోటకు; ముని – అత్రిమహాముని యొక్క ; వచః – మాటలయందలి ; నిరతిన్ – ఆసక్తితో; తఱి– సమయము/ కాలము ; పోవన్ – జఱుగునట్లుగా ; పుచ్చు – గడిపిన.*

**తాత్పర్యము :** ఓ రామా ! అంతట నీవు మఱల అత్రిమహామున్యాశ్రమమునకు వచ్చితివి. అచ్చట ఆ ముని చేయు వేదాంతోపన్యాసములను శ్రద్ధగా ఆలకించుచు కొంతకాలము గడిపితివి. అట్టి నిన్ను ధ్యానించెదను.

**కం. పాటవముతో విరాధ ని**
**శాటుం డఖిలర్షిబృంద । సంహారంబున్**
**బాటించుచుఁ గ్రుమ్మఱునెడ**
**వాటంబుగఁ జంపు నీకు । వందన రామా ! 39**



***లఘుటీక*** *: పాటవముతోన్ – బలపరాక్రమాదులతో ; విరాధ నిశాటుండు – విరాధుఁడను రాక్షసుఁడు ; అఖిల+ఋషిబృంద సంహారంబున్– ఋషులందఱి గుంపును చంపుట ; పాటించుచు – ఆచరించుచు ; క్రుమ్మఱు + ఎడన్ – తిరుగుచున్న సమయమునందు ; వాటంబుగన్ – నేర్పుతో ; వందన – నమస్కారము.*

**తాత్పర్యము :** ఓ రామా ! ఆ యడవిలో విరాధుఁడను రాక్షసుఁడు ఋషులను చంపుచు యథేష్టముగా తిరుగుచుండెను. అప్పుడు నీవు వానిని నీ అస్త్ర విద్యా పాటవమున మట్టుబెట్టితివి. అట్టి నీకు మా వందనములు ప్రభూ !

**కం. శరభంగాగస్త్యమునీ**
**శ్వరదర్శనముల నొనర్చి । వారల వలనన్**
**బరిపరివిధముల చరితము**
**లిరవుగ నాలించు నీకు । నీడన రామా ! 40**

***లఘుటీక*** *: ఒనర్చి – చేసి : పరిపరివిధముల – అనేకవిధములైన; చరితములు – పురాణకథలను : ఇరవుగన్ – చక్కగా : ఆలించు – ఆలకించిన ; ఈడన – స్తోత్రము.*

**తాత్పర్యము :** ఓ రామా ! పిదప నీవు శరభంగమహర్షిని, అగస్త్యమహామునిని దర్శించితివి. వారు వాత్సల్యముతో నీకెన్నియో పూర్వగాథలను తెలియఁజేసిరి.

వానిని శ్రద్ధగా ఆలకించిన నీకు మా స్తోత్రములు తండ్రీ !

**కం. అరుణజుఁడైన జటాయునిఁ**
**బురుపావనచిత్తము మెయిఁ । బూజించి తగన్**
**గురుతరవిషయములెన్నియొ**
**వరుసఁ దెలియు నీకు సంస్త । వనములు రామా !** **41**

***లఘుటీక*** *: అరుణజుఁడు – సూర్యసారథియైన అరుణుని కొడుకు : పురు – గొప్ప ; పావన – పవిత్రమైన ; చిత్తము మెయిన్ – మనస్సుతో ; తగన్ – తగునట్లుగా (సందర్భోచితముగా) ; గురుతర – మిక్కిలి గొప్పవియైన ; వరుసన్ – క్రమముగా ; సంస్తవనములు – స్తోత్రములు.*

**తాత్పర్యము :** ఓ రామా! అ దినవములలోనే అరుణుని కుమారుఁడైన జటాయువను గ్రద్ద నీకు తారసిల్లినది. నీవు దానిని పూజించి దానినుండి పెక్కు అపూర్వవిషయములను తెలిసికొంటివి. అట్టి నీకు మా స్తోత్రములు.

**కం. రావణు చెలియలు మన్మథ**
**భావంబున నిన్ను డాసి । భాషించునెడన్**
**బ్రోవక, "యస్మత్సోదరు**
**క్రేవకుఁ జను" మన్న నీకుఁ । గేల్మోడి రామా !** **42**

***లఘుటీక*** *: మన్మథ భావంబునన్ – కామముతో ; డాసి – సమీపించి ; భాషించు +ఎడన్ – మాటలాడునప్పుడు ; ప్రోవక – అనుగ్రహింపకుండ ; అస్మత్ – మా యొక్క ; సోదరు – తమ్ముని ; క్రేవకున్ – దగ్గఱకు ; చనుము – పొమ్ము ; కేల్+ మెుడి – అంజలి.*



**తాత్పర్యము :** ఓ రామా ! రావణాసురుని చెలియలైన శూర్పణఖ అను రాక్షస వనిత నీయందు మరులుగొన్నదై, ఒక అందమైన మానవస్త్రీరూపమును దాల్చి నీ దఱిఁజేఱినది. నీతో తన మోహమును వెల్లడించుచు మాటలాడఁగా నీవామెను అనుగ్రహింపవైతివి. పైపెచ్చు, "అడుగో ! అతఁడే మా తమ్ముఁడు. పేరు లక్ష్మణుఁడు. నాకంటెను అందగాఁడు. ప్రస్తుతము తనభార్యకు దూరముగానున్నాఁడు. అతని కడకు పొమ్ము" అని పరిహాసముగా పలికితివి. అట్టి నీ నిగ్రహమునకు జోహారులు.

**కం. సౌమిత్రి శూర్పణఖకు న**
**సామంబుగ ముక్కుసెవులు । సంఛేదింపన్**
**సామర్షులు తద్భ్రాతలు**
**మీ మీఁదఁ బడఁ గెడపు మిము । మెచ్చెద రామా !** **43**

***లఘుటీక*** *: సౌమిత్రి – లక్ష్మణస్వామి ; అసామంబుగన్ – సౌమ్యత లేకుండ ; సంఛేదింపన్ – కోయఁగా ; స+అమర్షులు – కోపముతో కూడినవారు ; తత్ – ఆమెయొక్క ; భ్రాతలు – సోదరులు ; కెడపు – చంపునట్టి.*

**తాత్పర్యము :** ఓ రామా ! అంతట నీ మాటమీఁద ఆమె నీ తమ్ముఁడైన లక్ష్మణుని కడకు వెడలినది. ఆమె యథార్థముగా మానవాంగన కాదనియు, ఎవర్తియో మాయావినియైన రాక్షసస్త్రీఅనియు లక్ష్మణుఁడు గ్రహించినవాఁడాయెను. గ్రహించి, సీతానింద చేసినందుకు ప్రతీకారముగా ఆమెను బట్టుకొని,

ముక్కుసెవులు కోసి పంపెను. ఆమె రక్తధారలోడుచు, గోలుగోలున ఏడ్చుచు తన సోదరులైన కొందఱు రాక్షసుల కడకేఁగి వారితో ఈ వృత్తాంతము చెప్పు కొనెను. అది విని వారంతా మీపై పగబూని, ఒకేసారి మీమీఁది కెత్తివచ్చిరి. వారందఱిని మీ అన్నదమ్ములు నిశ్శేషముగా హతమార్చిరి. అట్టి మీ పరాక్రమ మును మెచ్చుకొందును దేవా !

**కం. రోషంబున మీఁదఁ బడిన**
**దూషణముఖ భీకర బహు । దుష్టాసురులన్**
**భాషింపక శవములుగా**
**శోషిల్లం జేయ నీకు । స్తోత్రము రామా !** **44**

***లఘుటీక*** : *రోషంబునన్ – అక్కసుతో ; దూషణముఖ – దూషణుఁడు మొద లైన ; భీకర – భయంకరులగు ; దుష్ట+అసురులన్ – చెడ్డ రక్కసులను ; భా షింపక – మాఱుమాటాడని విధముగా ; శోషిల్లన్+చేయు – నిస్సత్తువలుగా చేయు.*

**తాత్పర్యము :** ఓ రామా ! ఆ సందర్భమున మిక్కిలి అక్కసుతో మీమీఁద పడిన ఖరదూషణ ప్రభృతి భయంకరులైన దుర్మార్గరాక్షసులను మఱియొక మాట లేక వధించి అచేతనములైన శవములుగా మార్చిన నీకు స్తోత్రములు.

**కం. జానకి నిన్నున్ బంగా**
**రేణమునకుఁ బుచ్చె ; మీర । లేఁగిన పిదపన్**
**బ్రాణేశ్వరి ప్రుచ్చిలఁబడఁ**



**గా నాక్రోశించు నీది కాదిలి రామా !** **45**

***లఘుటీక*** : *బంగారు+ఏణమునకున్ – బంగారపు లేడి కొఱకు ; పుచ్చెన్ – పంపఁగా ; మీరలు – మీరిద్దఱును (రాముఁడును, లక్ష్మణుఁడును) ; ఏఁగిన పిదపన్ – వెడలిన తరువాత; ప్రాణ+ఈశ్వరి– ప్రియురాలు (భార్య– జానకి) ; ప్రుచ్చిలఁ బడఁగాన్ – దొంగిలింపఁబడఁగా ; ఆక్రోశించు – పెద్దపెట్టున వాపోవునట్టి ; కాదిలి – ప్రేమము.*

**తాత్పర్యము:** ఓ రామా ! తన సోదరులు మీ చేతులలో మడిసినందుకా శూర్పణఖ మీపై కక్షగట్టినది. అంతట ఆమె లంకానగరమునకుఁ బోయి రావ ణాసురునితో నీవు చేసిన రాక్షస సంహారమును, సీతాదేవి చక్కదనమును వర్ణించి చెప్పినది. అది విని వాఁడు సీతామాతయందు మరులుగొని ఆమె నప హరింప సమకట్టెను.ఈ పాపవ్యవసాయమునకై వాఁడు తన మిత్రుఁడైన మారీ చుఁడను వృద్ధరాక్షసుని సహాయము వేఁడెను. మారీచున కిష్టములేకున్నను రావణుని బలవంతముపై సహాయముచేయుటకొప్పుకొని ఆ ప్రకారము తన మాయచేత ఒక మాయలేడి రూపమును దాల్చెను.

ఒకనాడు కుటీర పరిసరములలో మేఁత మేయుచున్న బంగారువన్నె గల లేడి ని చూచి సీత ముచ్చటపడినది. దానిని తెమ్మని నిన్నభ్యర్థించినది. ఆమె యొక్క ముచ్చట తీర్పఁదలఁచి నీవు దానిని పట్టఁబోయితివి. అది చిక్కక అతి వేగముగా పరుగెత్తినది. అప్పుడు నీవు దానిపై నొక బాణమును ప్రయోగిం చితివి. ఆ శరాఘాతమునకా లేడి, "హా సీతా! ఓ లక్ష్మణా !" అని నీ కంఠ స్వరముతో అఱచి చనిపోయినది. అందులకు నీ వాశ్చర్యచకితుఁడ వగుచు

కుటీరమునకు తిరిగివచ్చితివి. నిన్ను దారిలో లక్ష్మణుఁడు కలిసెను. మీరిద్దఱు కుటీరమునకు చేటి చూడఁగా సీత కనిపింపదయ్యె. ఆమెను రావణుఁడను రాక్షసరాజొకఁడు మాయాసన్న్యాసివేషమున వంచించి ఎత్తుకపోవుట మీరు ఎఱుఁగరైతిరి. సీతను కానక బిగ్గఱగా దుఃఖించిన నీదియే ప్రేమము.

**కం. సౌమిత్రి తాను వదినను**
**ధామంబున నిలిపివచ్చు । తద్రీతి వినం**
**గా మందలించి మదిలో**
**నీ మానినిఁ దలఁచు నీ వ । నింద్యుఁడు రామా !** **46**

***లఘుటీక*** *: ధామంబునన్ – ఇంటివద్ద ; నిలిపివచ్చు – ఉంచివచ్చిన ; తత్ + రీతిన్ – ఆ విధమును గూర్చి ; వినంగాన్ – విన్న తరువాత ; మానినిన్ – స్త్రీని (సీతాదేవిని) గూర్చి ; తలఁచు – ఆలోచించిన; అనింద్యుఁడు – నిందింపఁ గూ డనివాఁడవు.*

**తాత్పర్యము :** ఓ రామా ! చనిపోవుటకు మున్ను మారీచుఁ డాక్రోశించిన విధము విని సీతాదేవి భయకంపితయై నీకేదియో ఆపద సంప్రాప్తించినదనుకొని లక్ష్మణుని వెంటనే నీ రక్షణమునకై పొమ్మనెను. నీ శక్తిసామర్థ్యములయందలి అచంచలవిశ్వాసముచే లక్ష్మణుఁడు *“అవసరము లే”*దనెను.అది విని ఆతఁడన్న గారికి హానిఁ గోరుచున్నాఁడనియు, అట్లు తనను జేపట్టఁదలఁచుచున్నాఁడనియు, కావున అతఁడు దుర్మార్గుఁడనియు సీతాదేవి పరిపరివిధముల నాతనిని దుర్భాషలాడెను. “అది విని భరింపలేక ఆమెను కుటీరమందే ఉంచి వచ్చితి” నని లక్ష్మణుఁడు నీతో చెప్పెను. అది విని నీవు, “తమ్ముఁడా ! నీ వనవసరము



గా తొందఱపడితివి సుమా !” అని చెప్పి, నీ ప్రియురాలిని తలఁచుకొని దుఃఖించితివి.

**కం. వనముల నివేశనంబున**
**ఘనసరముల తటముల జన । కజను గవేషిం**
**చిననైనఁ గానఁజాలక**
**పెనుశోకముఁ జెందు నీది । ప్రేమము రామా !** **47**

***లఘుటీక*** *: వనములన్– అడవులలో; నివేశనంబునన్– ఇంటిలో; ఘనసరములన్ – గొప్ప సరస్సుల యొక్క; తటములన్ – తీరములందు; జనకజను – జనకుని కూఁతురైన సీతాదేవిని; గవేషించినన్ + ఐనను– వెదకినప్పటికిని; కానన్ +చాలక – చూడలేక ; పెనుశోకమున్ + చెందు–గొప్పదుఃఖమును పొందు.*

**తాత్పర్యము :** ఓ రామా ! అప్పుడు మీరింటిలోనను, సమీపారణ్యమందును, పరిసరములందలి చెఱువుగట్లమీఁదను, “సీతా సీతా!” అని యెలుఁగెత్తి బిగ్గఱగా పిలచుచు జానకీమాతను వెదకితిరి. కానీ ఆమె యెచ్చటను కానరాదయ్యె. అప్పుడు నీవు మిక్కిలి దుఃఖించితివి. ఆహా ! నీకు సీతమ్మవారన్న ఎంత ప్రేమ స్వామీ !

**కం. సీతాపహరణకథనము**
**శ్రోతవ్యంబుగ నొనర్చి । సోలి సమయఁగాఁ**
**బూతవిధి జటాయువునకుఁ**

ౘ్రేతక్రియ సలుపు నీది । ప్రేముడి రామా ! 48

***లఘుటీక*** *: సీతా+అపహరణ కథనమ్మున్ – సీతను అపహరించిన (ఎత్తుకొని పోయిన) కథను చెప్పుటను ; శ్రోతవ్యంబుగన్ – అర్థమగునట్లుగా ; ఒనర్చి – చేసి ; సోలి – శోష్లి ; సమయంగాన్ – చనిపోవగా ; పూతవిధిన్– పవిత్రమైన పద్ధతిలో ; ప్రేతక్రియన్ – అంత్యక్రియలను ; చలుపు – జఱిపిన ; ప్రేముడి – ఆదరము.*

**తాత్పర్యము :** ఓ రామా ! సీతను రావణాసురుఁడెత్తుకొని ఆకాశమార్గమున తన రథమునందు పెట్టుకొని పోవుచుండఁగా జటాయువను మహాగండ భేరుండము (పెనుగ్రద్ద) వానిని అటకాయించెను. ఆ గ్రద్ద దివ్యమైనది. అది సూర్యుని సారథియైన అరుణుని కొడుకు. మఱియు దశరథమహారాజునకు చిరకాల మిత్రుఁడు కూడ. అందుచేత అతఁడు తన స్నేహితుని కోడలిని విడిచిపెట్టుమని హుంకరించుచు రావణాసురునితో పోరాడెను. అంతట రావణాసురుఁ డొక ఖడ్గమును తీసుకొని దాని రెండుఱెక్కలను ఖండించి తన దారిన సాఁగిపోయెను. ఆ గ్రద్ద నిస్సహాయముగా నేలరాలెను కాని వెంటనే మరణింపలేదు. సీతమ్మను వెదకుచు దారిలో నీవా గ్రద్దను కలియుట తటస్థించినది. అది జఱిగిన వృత్తాంతమెల్ల నీకుఁ జెప్పి చనిపోయెను. అప్పుడు నీవు నీ తండ్రికి మిత్రుఁడైన జటాయువు యొక్క అంతిమసంస్కారములను భక్తి శ్రద్ధలతో శాస్త్రోక్తము గా నిర్వహించితివి. నీకు నీ తండ్రియెడల ఉన్న తత్పరత నే ఆయన స్నేహితుని యెడల కూడ చూపించితివి గదా దేవా !

**కం. ఉదరతలాక్షక్రవ్యా**



**దుదితములాలించి వాని । దునిమిన పిదపన్**
**దదుపాఖ్యానము హర్ష**
**ప్రదముగ నాలించు నీకుఁ । బ్రస్తుతి రామా ! 49**

***లఘుటీక*** *: ఉదరతల+అక్ష – పొట్టమీఁద కన్ను గలిగిన ; క్రవ్యాత్+ఉదితవులు – రాక్షసుని మాటలు ; ఆలించి – విని ; దునిమిన పిదపన్ – చంపిన తరువాత; తత్+ఉపాఖ్యానమ్మున్– వాని కథను ; చకితప్రదముగన్– ఆశ్చర్యము గొలుపగా ; ఆలించు – విన్న ; ప్రస్తుతి – స్తోత్రము.*

**తాత్పర్యము :** ఓ రామా ! దారిలో మీరు కబంధుఁడను రాక్షసుని చూచితిరి. వానికి తలలేదు కాని పొట్టమీఁద కన్నొకటి మాత్రముండెను. వాఁడు మీ కడ ప్రగల్భములను పలికెను. అప్పుడు మీరిద్దఱును కలిసి వానిని చంపివేసితిరి.ఆ తరువాత వాని కథ తెలిసికొని ఆశ్చర్యచకితులైరి.

**కం.మునితల్లజసంసేవన**
**మున విజ్ఞానంబుఁ గాంచి । ముదుసలియై నిన్**
**గనను మనియున్న శబరిన్**
**గని యామెతఁ గుడుచు నిన్నుఁ । గాంచెద రామా ! 50**

***లఘుటీక*** *: మునితల్లజ – మునివరులను ; సంసేవనమునన్ – సమగ్రముగా సేవించుట వలన ; విజ్ఞానంబున్ – ఆధ్యాత్మికజ్ఞానమును ; కాంచి – పొంది ; ముదుసలియై – వృద్ధురాలయి ; నిన్ – నిన్ను ; కనను – చూచుట కొఱకు ; మని+ఉన్న – బ్రతికి ఉన్న ; కని – చూచి ; ఆమెతన్ – విందును ; కుడుచు – ఆరగించు ; కాంచెదన్ – ఊహించుకొనెదను.*

**తాత్పర్యము :** ఓ రామా ! దారిలో మీకు శబరి అను ముదుసలితాపసి తారసి ల్లెను. ఆమె మునులకు శుశ్రూష చేసి జ్ఞానిని యైనది. నీవా దారిలో వచ్చెదవని మునుల వలన విని ఆమె పెక్కుసంవత్సరముల నుండి నీ దర్శనమునకై కాఁచుకొని ఉన్నది. నీకు పండ్లనుం సమర్పింపఁబోయి, 'అవి ఆరముగ్గినవో లేదో' అని పరీక్షింపఁగోరి, ప్రతిపండును కొఱికి చూచి నీకిచ్చినది. పవిత్రమైన ఆమె మనోభావమును గ్రహించి నీవా యెంగిలివిందును తిరస్కరింపకుండ ప్రేమతో చిఱునగవు నవ్వుచు స్వీకరించితివి. అట్టి నీ హృదయవైశాల్యమును భావన చేసికొందును స్వామీ !

**కం. సానుజముగఁ గదలి మహత్**
**పానీయేందీవరయుత । పంపాతటముఙ్**
**జానకి కోమలరూప**
**ధ్యానంబునఁ జేఱు నీకు । దణ్ణము రామా ! 51**

***లఘుటీక :*** *సానుజముగఙ్– అనుజుఁడైన(తమ్ముఁడైన) లక్ష్మణునితో సహా ; మహత్– గొప్ప ; పానీయ+ఇందీవర– నీరును, కలువపూలును ; యుత– కలిగియున్న ; పంపాతటమున్– పంప అను నది యొక్క ఒడ్డును ; జానకి – సీతాదేవి యొక్క ; కోమల– మృదువైన ; రూప– ఆకారమును ; ధ్యానంబున ఙ – ధ్యానించుటతో (ధ్యానించుచు) ; దణ్ణము – నమస్కారము.*

**తాత్పర్యము :** ఓ రామా ! ఆ తరువాత నీవు నీ తమ్ముఁడైనలక్ష్మణునితో సహా బయలుదేఱి, సీతాదేవిని గుఱించియే ఆలోచించుచు, పుష్కలమైననీటితోఁడను, కలువపూలతోఁడను విరాజిల్లుచున్న **పంప** అను నది ఒడ్డునకు చేఱుం కొంటివి.



**కం.ఆ విపులతటంబున సతి**
**భావించుచు విప్రలంభ । బాధావశతఙ్**
**భూవినుతసత్ప్రతాపా**
**భావుఁడవగు నిన్ను బుద్ధిఁ । బాయను రామా ! 52**

***లఘుటీక :*** *ఆ విపులతటంబునఙ్ – ఆ పంపానది యొక్క విశాలమైన ఒడ్డున ; సతిఙ్ – సాధ్వియు, నీ సహధర్మచారిణియుు నైన సీతాదేవిని గూర్చి ; భావించుచుఙ్ – ఆలోచించుచు ; విప్రలంభ – ఎడఁబాటు వలన జనించిన ; బాధావశతన్ – మనోవేదనకు లోనగుట చేత ; భూ– లోకముచేత ; వినుత – పొగడఁబడిన సత్– మంచి (నిర్మలమైన, మచ్చలేని); ప్రతాప+అభావుఁడవు +అగు– పరాక్రమము లోపించినవాఁడవయిన; బుద్ధిఙ్– మనస్సులో; పాయ ను– విడిచి పెట్టను.*

**తాత్పర్యము :** ఓ రామా ! అంతట నీవా పంపానది ఒడ్డున కొంత తడవు విశ్ర మించితివి. అప్పుడు కూడ సీతనుగూర్చియే ఆలోచించుచు, ఆమె విరహము తో పదేపదే వాపోవుచు, లోకులచే కొనియాడఁబడిన నీ ధైర్యమును, అవక్ర పరాక్రమమును తాత్కాలికముగా విడిచిపెట్టితివి. అట్టి నీ ధ్యానమును నేను నా మనస్సులో ఏమరను ప్రభూ !

**కం. హనుమత్సహాయమున సూ**

**ర్యుని పుత్త్రునితోడ మైత్రి । యొనరిచి పిదపన్**
**జనకసుతాలంకారము**
**లను జూపఁగ వనరు నిన్ దలంచెద రామా ! 53**

***లఘుటీక :*** *హనుమత్+సహాయమునన్– హనుమంతుని బాసటతో ; సూర్యుని పుత్త్రుని తోడ – సుగ్రీవునితో ; మైత్రి+ఒనరిచి – స్నేహము చేసి ; పిదపన్ – తరువాత ; జనకసుతా – జనకుని కూఁతురైన సీతాదేవి యొక్క ; అలంకారములను –ఆభరణములను ; వనరు – శోకించు.*

**తాత్పర్యము :** ఓ రామా! మీరా అడవిలో ధ్యేయరహితులై తిరుగాడుచుండఁగా, దగ్గఱలో ఋష్యమూక పర్వతము మీఁద విధివశాత్తు నివసింపఁజొచ్చిన సుగ్రీవుఁడను వానరరాజు మిమ్ములను చూచెను. మీరు తనశత్రువులో మిత్రులో తెలిసికొనుటకై తన మంత్రియైన హనుమంతుని మీ కడకు పంపెను. ఆ హనుమంతుఁడు కామరూపుఁడగుటచే బ్రాహ్మణరూపమును ధరించి మీ వద్దకు వచ్చి మీతో మాటలాడెను. ఆతని మాటపై మీరాతని మూఁపున ఎక్కి సుగ్రీవుని వద్దకు వెడలితిరి. అక్కడ మీకును, సుగ్రీవునకును అగ్నిసాక్షిగా గాఢసఖ్యము కుదిరెను. ఆకాశమునందొక రాక్షసుఁడు ఒక సుందరస్త్రీని తనరథము మీఁద పెట్టుకొని, దక్షిణదిగున్ముఖముగా పోవుట తాము చూచితిమనియు, ఆమె తన ఆభరణములను తీసి నేలమీఁదకు విసరివేయఁగా పట్టుకొంటిమనియు తెలిపి, వానిని వారు నీకు చూపిరి. నీవు వానిని గుఱుతుపట్టి, సీతను తలఁచుకొని మఱల దుఃఖించితివి. అట్టి నిన్ను ధ్యానించెదను దేవా !

**కం. స్వాపదఁ దెలిపి మఱియు సవి**
**లాపంబుగ వాలిసోద । రాస్యమునఁ దదీ**
**యాపదలుఁ దెలిసి వానినిఁ**
**గాఁపు సలుపఁబూను నీకుఁ । గత్థన రామా ! 54**

***లఘుటీక :*** *స్వ+ఆపదన్– తన కష్టమును గూర్చి ; స+విలాపంబుగన్– ఏడుపులతో కూడియుండఁగా (కూడియుండునట్లు) ; వాలిసోదర+ఆస్యమునన్ – వాలికి తమ్ముఁడైన సుగ్రీవుని నోట ; తదీయ+ఆపదలున్ – ఆతని కష్టములను కూడ ; కాఁపు+చలుపు – రక్షణ చేయు ; కత్థన– స్తోత్రము.*

**తాత్పర్యము :** ఓ రామా ! అంతట మీరు మీ వృత్తాంతము యావత్తు సుగ్రీవునికి తెలియఁజేసితిరి. సుగ్రీవుఁడును మిక్కిలి దుఃఖముతో తన రాజ్యమును, భార్యను తనఅన్న వాలి స్వాధీనముచేసికొన్న వైనమును మీకు విశదీకరించెను. అప్పుడు నీవు,“వాలిని చంపి సుగ్రీవుని భార్యను, రాజ్యమును ఆతనికి మఱల చేకూర్చెద” నని ప్రతిజ్ఞ చేసితివి. అటువంటి నీ యథార్థమైత్రీభావమునకు మా స్తోత్రములు స్వామీ !

**కం. మాయావిదుందుభులయు న**
**మేయాఖ్యానంబులు విని । మేదినిమీఁదన్**
**హేయములగు తాళంబుల**
**మాయించిన నీకు మా న । మస్కృతి రామా ! 55**

***లఘుటీక :*** *అమేయ+ఆఖ్యానంబులు – గొప్ప కథలు ; మేదిని – భూమి ; హేయములగు – హీనములైన; తాళంబులన్ – తాఁడిచెట్లను ; మాయించిన–*

*రూపుమాయించిన (కూల్చి నాశనము చేసిన) ; నమస్కృతి – నమస్కారము.*

**తాత్పర్యము :** ఓ రామా ! వాలియంతటి బలశాలిని తెగటార్పఁగల శక్తిసామర్థ్యములు నీకు కలవో, లేవో యని శంకించిన సుగ్రీవుఁడు నిన్నుఁ బరీక్షింప సమకట్టెను. ఆతఁడు నీకు ఏఁడు తాఁడిచెట్లను చూపి వానిని కూల్చుమనెను. నీవు వెంటనే ఒకే ఒక్క బాణమును సంధించి వాని నన్నింటిని కూల్చివేసితివి. అట్టి నీకు మా నమస్కారములు స్వామీ !

**కం. సుగ్రీవుఁడు వేఁడఁగ న**
**త్యుగ్రబలంబునఁ గడంగి । దుందుభికాయం**
**బగ్రముగ మీఁటివైచిన**
**విగ్రహమవు నీకుఁ గోటి । వినుతులు రామా ! 56**

***లఘుటీక :*** *కడంగి–పూనుకొని; కాయంబు–శరీరమును;అగ్రముగన్– ముందుకు; మీఁటివైచిన– గోటితో విసరివేసిన; విగ్రహమవు – మూర్తివి ; వినుతులు – పొగడితలు.*

**తాత్పర్యము :** ఓ రామా! సుగ్రీవుఁడు నీ అస్త్రముల సామర్థ్యము తెలిసికొనెను. కానీ నీ శరీరబలమాతనికి తెలిసినది కాదు. కావున తన అన్నచేతిలో చనిపోయిన దుందుభి అను మహారాక్షసుని మృతకళేబరమును నీకు జూపి దానినెత్తి పారవేయుమనెను. అంత నీవు నవ్వుచు కొండంత బరువైన ఆ కళేబరమును నీ కాలి గోటితో మీఁటివేసితివి. అట్టి నీకు వేయి స్తోత్రములు స్వామీ !

**కం. తొలికయ్యంబున వాలియె**
**గెలుచుటఁ గని వారిరువు టొ । కే పొడ నుండన్**
**దెలియక యూరుకొని పిదపఁ**
**గలఁగితివి గద రవిపుత్త్రు । కనలున రామా ! 57**



***లఘుటీక :*** *తొలి – మొదటి ; కయ్యంబునన్ – యుద్ధములో ; ఒకే పొడన్ – ఒకే రూపముతో ; కలఁగితివి – కలఁత చెందితివి ; రవిపుత్త్రు – సుగ్రీవుని యొక్క ; కనలున్ – కోపముచేత.*

**తాత్పర్యము:** ఓ రామా! నీ బలమునందలి అపార విశ్వాసముతో సుగ్రీవుఁడు వాలిభవనమునకు వెడలి తనతో ద్వంద్వయుద్ధమునకు రమ్మని గర్జించెను. వారిరువుఱును కలియఁబడి పోరుచుండఁగా, వారిలో వాలి యెవటో, సుగ్రీవుఁడెవటో నిశ్చయముగా గుఱుతుపట్టలేక నీవు ఊరకుంటివి. అంతట వాలి యెప్పటియట్లే సుగ్రీవుని చిత్తుచిత్తుగా చావఁగొట్టి, ప్రాణమాత్రావశిష్టుని జేసి పోయెను. స్పృహ వచ్చిన పిమ్మట సుగ్రీవుఁడు నీయందు కోపించెను. "రామా ! నీ స్నేహమును నమ్ముకొనుట చేతనే నాకీ గతిపట్టిన" దని నిందించెను. సుగ్రీవుని మాటలకు నీవు కలఁతచెంది నీ అయోమయమాతనికి వివరించితివి.

**కం. దారయగు తార తన్ను ని**
**వారించిన వినక వచ్చు । వాలినిఁ గలన్**
**సూరకుమారునిచేతన్**
**బోరించ ఁచుఁ జంపు నీకుఁ । బూజలు రామా ! 58**

***లఘుటీక :*** *దార– భార్య ; నివారించినన్ – అడ్డుకొన్నను ; కలన్ – యుద్ధ*

*ములో ; సూరకుమారునిచేతఁ – సుగ్రీవునిచేత ; పోరించుచుఁ – పోరాడున ట్లు చేసి.*

**తాత్పర్యము:** ఓ రామా! సుగ్రీవుఁడు నీవిచ్చిన సమాధానముతో స్థిమితపడెను. మఱునాడు నీవు సూచించిన చొప్పుననే గజపుష్పమాల ధరించి, మఱల వాలి భవనమున కేఁగి, యుద్ధమునకు రమ్మని గర్జించెను. అది విని ఆగ్రహోదగ్రుఁ డై వెడలనున్న వాలిని ఆతని భార్య, తార నిలువఱించి, "ఒకమారు దెబ్బలు తిన్న సుగ్రీవుఁడు మఱల యుద్ధమునకాహ్వానించుటలో ఏదియో మోసము కలదు. ఆతనికెవ్వరో మహాబలవంతులు సహాయము చేయనున్నారు. కనుక నీవు వెడలవల"దని హెచ్చరించెను. కాని గర్వమదాంధుఁడయిన వాలి ఆమె మాటలను పెడచెవిని పెట్టి వచ్చి సుగ్రీవునితో కలియబడెను. గజపుష్పమాలా ధారణము వలన నీవు వారి నడుమ భేదమును గుఱుతుపట్టి, వాలిపై శరము ను సంధించి పరిమార్చితివి. అట్టి నీకు మా కొలుపులు స్వామీ !

**కం. మిన్నక నీకుఁ ధార్మిక**
**పన్నంబులు పలుకుచున్న । ప్లవగపతికి మేల్**
**దెన్నుఁ బ్రబోధించి తదా**
**పన్నతఁ బోకార్చు నీకు । భజనము రామా ! 59**

***లఘుటీక:*** *మిన్నక – ఊరకే ; ధార్మిక పన్నంబులు – నీతిబోధలు ; ప్లవగపతికి ఁ – కోఁతుల రాజైన వాలికి ; మేల్+తెన్ను – సన్మార్గమును ; తత్+ఆపన్నతఁ – సంకటమును ; పోకార్చు – పోఁగొట్టు.*



**తాత్పర్యము:** ఓ రామా! నీ శరము తన మేన నాఁటిన వెంటనే వాలి చావలేదు. "తనపై బాణము వేసినదెవఁడా ?" అని సాలోచనముగా పరికించుచుండెను. ఇంతలో నీవు వచ్చితివి. "నిరాయుధుఁడైన తనను సాయుధుఁడైన నీవు చం పుట, అందునా చెట్టుచాటున నుండి చంపుట మిక్కిలి అధర్మ" మని వాలి ఆక్రోశించెను. అంతట నీవు "సమస్త మహీమండలమున్ను ఇక్ష్వాకువంశజులద నియు, ఆతఁడు వారి రాజ్యమునందలి వన్యమృగములలో నొక్కఁడు మాత్రమే ననియు, వన్యప్రాణులను వధించు అధికారము రాజులకు గల"దనియు చెప్పి వాలి చేసిన అధర్మకార్యములను ఏకరువు పెట్టితివి. అది విని వాలి, తన అకృ త్యములకు పశ్చాత్తాపము చెంది, తన భార్యాబిడ్డల భారమును సుగ్రీవున కొప్పగించి శరీరమును వదలినవాఁడాయెను.

**కం. ఘనముగ సుగ్రీవునిచే**
**ననంతరక్రియల వాలి । ననిపి వివస్వత్**
**తనయున కభిషేకక్రియఁ**
**బొనరించిన నీది చతుర । బోధము రామా ! 60**

***లఘుటీక:*** *అనంతరక్రియలఁ– తరువాతఁ జేసిన అంత్యక్రియలతో; అనిపి – పరలోకమునకు పంపి; వివస్వత్+తనయునకుఁ– సూర్యపుత్త్రుఁడైన సుగ్రీవు నికి అభిషేకక్రియఁ– రాజ్యాభిషేకమును; పొనరించిన– చేసిన; చతురబోధ ము – తెలివి గల వివేకము.*

**తాత్పర్యము:** ఓ రామా ! అట్లు చనిపోయిన వాలికి ఆతని కొడుకైన అంగ దునిచేత అంత్యక్రియలను జఱిగించి ఉత్తమగతులకు పంపితివి. ఆ పిమ్మట

వానరరాజ్యమునకు సుగ్రీవుని రాజుగా నభిషేకించితివి. అట్టి నీ వివేకమే వివేకము ప్రభూ !

**కం. ఏ పాపంబు నెఱుంగని**
**నా పతి నిశ్శస్త్రు మఱుగుననా । దునుముట యనా**
**బాపమున నిట్టి మృత్యువె**
**ప్రాపించెదవని శపింపఁ । బడితివి రామా !** **61**

***లఘుటీక*** *: నిః+శస్త్రున్ – ఆయుధములు ధరింపనివానిని ; మఱుంగునన్ – మాటునుండి ; దునుముట అన్ – చంపుట అనెడి ; మృత్యువె – చావే ; ప్రాపించెదవు – పొందెదవు.*

**తాత్పర్యము :** ఓ రామా ! వాలి చనిపోవుటచేత ఆతని భార్యయైన తార వైధవ్య దుఃఖమును పొంది, "నీకెన్నడును ఏ అపకారమును జేయని నిరాయుధుఁడయిన నా భర్తను చెట్టుచాటున నుండి అన్యాయముగా చంపినావు కావున నిన్ను కూడ ఎవరో ఒకటిట్లే చెట్టుచాటున నుండి బాణము వేసి చంపెదరుగాక" అని నీకు శాపమిచ్చెను. "ఈ శాపమును రాఁగల కృష్ణావతారములో అనుభవింపఁగలవాఁడ" వని చెప్పి నీవందుల కొడంబడితివి.

**కం. ప్రావృట్కాలంబున సీ**
**తా విరహవేదనమునఁ । దమితోఁ దత్కా**
**లావస్థఁ గూర్చి పాడిన**
**నీ వర్ణనరీతి నెట్లు । నేర్తుము ? రామా !** **62**



***లఘుటీక*** *: ప్రావృట్+కాలంబునన్ – వర్షాకాలములో ; సీతావిరహవేదనమునన్ – సీతమ్మ నుండి కలిగిన యెడఁబాటు వలని బాధతో ; తమితోన్ – కోరికతో/ ప్రేమతో ; తత్+కాల+అవస్థన్ గూర్చి – ఆ ఋతువులో నెలకొన్న వాతావరణ పరిస్థితిని గుఱించి ; నేర్తుము – నేర్చుకొనఁగలము.*

**తాత్పర్యము :** ఓ రామా ! వదవడి వర్షాకాలము సంప్రాప్తమైనది. అప్పుడు నీవు సీతావిరహముతో ఆ మనోహర ఋతులక్షణములను గుఱించి పరిపరి విధముల గానము చేసితివి. అట్టి లోకోత్తరమైన నీ వర్ణనశైలి మాకెట్లు పట్టుపడును స్వామీ ?

**కం. తఱి గడచుచున్ననైన**
**న్నరుణాత్మజు రామి నరసి । యతికుపితుఁడవై**
**త్వర సౌమిత్రిఁ బనిచి యు**
**త్తరమును రప్పించిన నినుఁ । దలఁచెద రామా !** **63**

***లఘుటీక*** *: తఱి – సమయము ; గడచుచున్ననైనన్ – మించిపోవుచున్నను ; అరుణాత్మజు రామిన్ – సుగ్రీవుఁడు నీ కడకు రాకపోవుటను ; అరసి – గమనించి ; అతి+కుపితుఁడవై – మిక్కిలి కోపించినవాఁడవై ; త్వరన్ – తొందరగా ; సౌమిత్రిన్ – లక్ష్మణుని ; పనిచి – పంపి ; ఉత్తరమును – సమాధానమును ; రప్పించిన – తెప్పించిన.*

**తాత్పర్యము :** ఓ రామా! వానరరాజ్యమును తన కిప్పించినచో వర్షాకాలము కడచినవెంటనే సీతాదేవి నన్వేషించుటకు వానరులను పంపెదనని సుగ్రీవుఁడు నీ కంతకుమున్ను వాగ్దానము గావించి యుండెను. అట్లే వానకాలము కడచి పో

యినది కూడ. కాని సుగ్రీవునినుండి వర్తమానమేమియును రాదయ్యెను. అప్పుడు నీవు కోపించి లక్ష్మణు నాతని కడకు పంపితివి. నీ సందేశము విని, సుగ్రీవుఁడు భయపడినవాఁడై ముందు నీకనుకూలముగా సమాధానమును పంపెను. ఆ తరువాత వెనువెంటనే నీ దర్శనార్థమై ఉరుకులు-పరుగులతో వచ్చెను. అట్టి సకలలోక భీషణుఁడ వైన నిన్ను స్మరించెదను దేవా !

**కం. ఆ సుగ్రీవుని తోడుత**
**వాసిగ యోచనముఁ జేసి । వనచరవరుఁడ**
**క్కేసరిపుత్త్రున కుంగర**
**మాస నొసఁగి పుచ్చు నీకు । నర్చన రామా ! 64**

***లఘుటీక*** *: వాసిగన్ – చక్కగా, నాణ్యముగా ; యోచనమున్ – ఆలోచనమును ; వనచరవరుఁడు– వానరులలో శ్రేష్ఠుఁడైన; ఆ+కేసరిపుత్త్రునకున్– హనుమంతునకు ; ఆసన్ – ఆశతో ; ఒసఁగిపుచ్చు – ఇచ్చిపంపిన ; అర్చన – పూజ.*

**తాత్పర్యము:** ఓ రామా! అప్పుడు నీవును, సుగ్రీవుఁడును గలసి తదుపరి కార్యక్రమమును గూర్చి సునిశితముగా ఆలోచించిరి. ఒకవేళ సీతాదేవి యెచటనైన కానవచ్చెనేని ఆమె రామదూతలను గుఱుతుపట్టుటకు వీలుగా హనుమంతునికి నీవు నీ ఉంగరము నిచ్చిపంపితివి.

**కం. శతవలి నుత్తరదిశకున్**
**బ్రతీచికి సుషేణు యామ్య । పార్శ్వమున మరుత్**



**సుతునిం బ్రాచ్యమునకు వి**
**నతునిం బ్రేషించు నీకు । నతులగు రామా ! 65**

***లఘుటీక:*** *ప్రతీచికిన్– పడమటికి; యామ్యపార్శ్వమునన్– దక్షిణ దిశకు; ప్రాచ్యమునకున్–తూరుపునకు; ప్రేషించు–పంపినట్టి; నతులు– ప్రణామములు.*

**తాత్పర్యము :** ఓ రామా ! నీవు వానరవీరులలో శతవలి అనువానికి కొంతసైన్యమిచ్చి ఉత్తరదిశకు పంపితివి. సుషేణుఁడనువానికి కొంత సైన్యమిచ్చి పడమటికి పంపితివి.అట్లే దక్షిణమునకు హనుమంతుని, తూఱుపునకు వినతుఁడ ను వానిని పంపితివి. అట్టి నీకు మా ప్రణామములు.

**కం. సీతను జూచిన కేసరి**
**సూతి నిజగమనవిధంబు । సొంపుగఁ దా నీ**
**రీతిని వివరింపఁగ సం**
**జాతానందంబున విను నినుఁ । జాటెద రామా ! 66**

***లఘుటీక*** *: కేసరిసూతి – హనుమంతుఁడు ; నిజ గమన విధంబున్ – తాను వెడలిన విధానమును ; సొంపుగన్ – శ్రావ్యముగా ; సంజాత+ఆనందమునన్ – మనస్సునందు పుట్టిన ఆనందముతో ; చాటెదన్ – ప్రజలకు ప్రకటించెదను.*

**తాత్పర్యము :** ఓ రామా ! అట్లు పంపఁబడినవారిలో హనుమంతుఁడొక్కఁడే సీతాదేవి యెక్కడ నున్నదో కనిపట్టి వచ్చెను. వచ్చి తన ప్రయాణవిధానమును నీతో ఈ క్రిందివిధముగా శ్రావ్యముగా వివరించెను.ఆతని మాటల కంతరంగ

మునం దానందము ఉప్పొంగఁగా ఆసక్తితో విన్న నిన్ను కీర్తించెదను స్వామీ !

*(ఇక ఈ క్రింద 67వ పద్యమునుండి 102 వ పద్యము వఱకు హనుమంతుల వారి వచనములే. వీనిని కవివాక్యములుగా గ్రహింపకుండునది)*

**కం. ఎంతయు దూరం బెన్నియొ**
**పుంతలలోఁ జన్ననైన । భూసుత జాడన్**
**గొంతయుఁ బోల్చుకొనకయె య**
**నంతాంబుధి యొడ్డుఁ జేటి । నారము రామా ! 67**

***లఘుటీక*** *: పుంతలలోన్ – మార్గములలో ; చన్ననైనన్ – వెడలినను ; భూసుత జాడన్ – సీతాదేవి యొక్క జాడను ; కొంతయున్ – కొంచెమైనను ; పోల్చుకొనకయె – గుఱుతుపట్టకయే ; అనంత+అంబుధి ఒడ్డున్ – పారములేని సముద్రపు తీరమును.*

**తాత్పర్యము :** ఓ రామా ! సీతాదేవి యునికిని కనుగొనఁగోరి మేము ఎన్నో దారులలో ఎంతయో దూరము ప్రయాణించితిమి కానీ ఆమెజాడను పట్టమైతిమి. అంత, నిరాశోపహతులమై దక్షిణసముద్రపు టొడ్డునకు చేఱుకొంటిమి.

**కం. అంగదుఁ డప్పుడు చింతా**
**సంగతిఁ బ్రాయోపవేశ । సక్తుండయి యా**
**త్మాంగమును వీడఁబోవుడు**
**భంగం బొనరించె గరుడ । బంధువు రామా ! 68**

***లఘుటీక*** *: చింతాసంగతిన్ – విచారముతో కూడుకొనియుండుట వలన; ప్రాయోపవేశ సక్తుండయి – అన్నపానీయములు మాని చచ్చునంతవఱకు ఉపవసింప నాసక్తి గలవాఁడై ; ఆత్మ+అంగమును– తన శరీరమును ; వీడన్+పోవుడున్ – వదలిపెట్టనుండఁగా ; భంగంబు+ఒనరించెన్ – అట్లు జఱుగకుండ చేసెను ; గరుడబంధువు – గరుత్మంతుని జాతికి చెందిన పక్షి.*



**తాత్పర్యము :** ఓ రామా! సీత జాడ తెలియనందుకు వాలికుమారుఁడైన అంగదుఁడు మిక్కిలి వగచుచు, “ఈ చేతకాని మొగమును మఱల శ్రీరామ సుగ్రీవుల కెట్లు చూపఁగల” నని సంకోచించి, చచ్చునంతవఱకు ఉపవసింప నిశ్చయించుకొని వానరవీరులతో సహా ఆ దక్షిణసముద్రపు టొడ్డున మౌనముగా శయనించెను. అది చూచిన ఒక గ్రద్ద ఆశ్చర్యపడి, వారిని మానవభాషలో పలుకరించి వారికి ప్రాయోపవేశ వ్రతభంగము చేసెను.

**కం. అది సంపాతిసమాహ్వయ,**
**మది యన్న జటాయువునకు, । నాత్మీయకథన్**
**విదితం బొనర్ప వింటిమి,**
**విదళిత రక్షఃప్రవీర । విసరా ! రామా ! 69**

***లఘుటీక*** *: సంపాతిసమాహ్వయము– సంపాతి అను పేరుగలిగినది; ఆత్మీయకథన్– తన కథను; విదితంబు+ఒనర్పన్– తెలివిడి చేయఁగా ; విదళిత – చీల్పఁబడిన ; రక్షః+ప్రవీర – రాక్షస శూరశిఖామణుల ; విసరా – సమూహము గలిగినవాఁడా! (రాక్షస శూరశిఖామణుల గుంపులను చీల్చిన వాఁడా!)*

**తాత్పర్యము:** ఓ రామా! ఆ గ్రద్ద పేరు సంపాతి. అది జటాయువునకు అన్న గారు. తన తమ్ముఁడైన జటాయువు రావణాసురుని చేతిలో నిహతుఁడైనాఁడని విని ఆ గ్రద్ద మిక్కిలి దుఃఖించెను. తన తమ్ముని పట్ల తనకెంత వాత్సల్యమో తెలుపుచు అది మాకొక వృత్తాంతము చెప్పినది. చిన్నతనమునందొక మారు అదియును, జటాయువును ఎగురుటలో పందెముపెట్టుకున్నారట. ఒకటిని మించి మఱియొకటిం ఎగురుచు చివఱకు సూర్యమండలమునకు చేఱుఁకొన్నారఁట. జటాయువు తన యన్నను మించవలెనను పట్టుదలలో ముందువెనుకలు చూడకుండ సూర్యునకు సమీపముగా ఎగురుచుండెనఁట. అది చూచిన సంపాతి తన తమ్ముఁడు సూర్యుని ప్రచండజ్వాలలలో కాలిపోవునేమోనని భయపడి, ఒక్క ఉదుటున పైకి లంఘించి, ఆతని కెండవేఁడిమి తగులకుండ తన ఱెక్కలను ఆతనికి రక్షణగా కప్పెనఁట. వెనువెంటనే సూర్యుని ప్రచండజ్వాలలు నేరుగా తనకే తగిలి, ఱెక్కలు పూర్తిగా కాలిపోయి, బంతివలె దొఱలుచు భూమండలము మీఁద పడిపోయెనఁట. అప్పటినుండి ఆతఁడా దక్షిణ సముద్రపు టొడ్డుననే నివసించుచున్నాఁడఁట. ఆతఁడు మాకీ వృత్తాంతమును తెలుపుచుండఁగనే పూర్వమొక ముని దీవించిన ప్రకార మాతనికి ఱెక్కలు మొలఁచుకొని వచ్చెను.

**కం. ఆ సంపాతిఘనుఁడు సీ**
**తాసతి గలచోటుఁ దెలిపి । తడయక దశకం**
**ఠాసురుఁ డామెను ప్రుచ్చిలి**
**మోసంబున మూసెననియె । మోసున రామా ! 70**



**లఘుటీక**: *ఆ సంపాతిఘనుఁడు – ఘనుఁడైన ఆ సంపాతి ; సీతాసతి – సీతాసాధ్వి; కలచోటుఁ– ఉన్నచోటును; తడయక–ఆలస్యముచేయక (వేగముగా) ; దశకంఠ+అసురుఁడు– రావణుఁడను రాక్షసుఁడు ; ప్రుచ్చిలి – దొంగిలించి ; మోసునన్ – మోహముతో ; మూసెన్– రహస్యముగా దాఁచెను ; అనియెన్ – అన్నాఁడు.*

**తాత్పర్యము :** ఓ రామా ! రావణాసురుఁడను రాక్షసరాజు సీతాసాధ్విని మోహముతో ఎత్తుకొనిపోయి తన రాజధానియైన లంకలో రహస్యముగా దాఁచెనని ఆ సంపాతి మాతో చెప్పెను.

**కం. మా వానరులందెవ్వఱు**
**నా వననిధి నూఱుయోజ । నంబుల కెళవుఁన్**
**జేవఁ గడవఁబెట్టమి నే**
**వావిరి దాఁటితిని వీర । వర్యా రామా ! 71**

**లఘుటీక**: *వననిధి – సముద్రపు ; నూఱు యోజనంబుల– 1,600 కిలోమీటరుల ; కెళవున్ – దూరమును ; చేవన్ – శక్తితో ; కడవన్+పెట్టమిన్ – దాఁటలేకపోవుటచే ; ఏన్– నేను ; వావిరిన్– క్రమముగా/వరుసగా ; వీరవర్యా ! – వీరులలో శ్రేష్ఠుఁడవైన ఓ శ్రీరామచంద్రప్రభూ!*

**తాత్పర్యము:** ఓ రామా! లంకారాజ్యమక్కడనుండి నూఱుయోజనముల దూరమున్నది. కాని వానరులలోఁ గొందఱు పదియోజనములున్ను, ఇంకొందఱేఁబదియోజనములున్ను, మఱికొందఱెనుబదియోజనములున్ను దాఁటఁ

జాలినవారు. పూర్తిగా నూఱుయోజనముల నతిక్రమింపఁజాలు బలోపేతు లెవ్వఱున్ను లేకపోవుటచే నే నందుల కొడంబడి సముద్రమును దాఁటితిని.

**కం. ఆ యర్ణవంబుపై నన**
**పాయంబుగ నేను దాఁటు । పట్టున నన్నున్**
**జేయెత్తి చీఁటె నున్నత**
**కాయుఁడు మైనాకశిఖరి । కాదిలి రామా ! 72**

***లఘుటీక:*** *అర్ణవంబుపై– సముద్రముపై; అన్+అపాయంబుగన్– ప్రమాదమే మియు లేకుండ (క్షేమముగా); దాఁటుపట్టునన్– దాటుచున్న సమయము లో ; చీఁటెన్– పిలచెను ; ఉన్నతకాయుఁడు – ఎత్తయిన శరీరము గలవాఁడు ; మైనాక శిఖరి –మైనాకుఁడను పర్వతము ; కాదిలిన్ – ప్రేమతో.*

**తాత్పర్యము:** ఓ రామా! నేనట్లు సముద్రముపై నిరాటంకముగా నెగురుచు దానిని దాఁటుచున్న సమయమున మిక్కిలి పెద్దశరీరము గల మైనాకుఁడను పర్వతమా నీటిలోనుండి పైకి లేచి నన్ను ప్రేమతో పిలిచెను. విచిత్రముగా నాత నికి ఱెక్కలున్నవి. పూర్వకాలమున పర్వతములన్నింటికిని ఱెక్కలు గలవఁట. ఆతఁ డొక్కఁడు మట్టుకు మా తండ్రియైన వాయుదేవుని సాహాయ్యముచేతఁ దన ఱెక్కలు దేవేంద్రుని వజ్రాయుధమునకొఱకాకుండ తప్పించుకొన్నాఁడఁట. ఆ యాదరమునఁ జేసి ఆతఁడు నాకాతిథ్యమివ్వఁగోరెను.

**కం. ఆ పిలుపున ధన్యుఁడనని**
**తోఁపిన క్రియఁ జెప్పి నేను । దొరఁగుచునుండన్**
**గోపారుణాక్షి యొక్కతె**



**యాఁపెను నా నీడఁబట్టి । యచటనె రామా ! 73**

***లఘుటీక:*** *ఆ పిలుపునన్ – ఆ ఆహ్వానముచే; ధన్యుఁడన్ + అని – అదృష్టవం తుఁడను అని/ఆశీర్వదింపఁబడినవాఁడను అని; తోఁపిన క్రియన్ – నాకు తోఁచినట్లు ; దొరఁగుచు నుండన్ – ఆ ప్రదేశమును వీడిపోవుచుండఁగా ; కోప+అరుణ+ అక్షి – కోపముతో ఎఱ్ఱబడిన కండ్లు గలిగిన స్త్రీ ;*

**తాత్పర్యము:** ఓ రామా! నేనప్పుడు, మీ పిలుపుమాత్రముననే ధన్యుఁడనైతి నని ఆతనితో చెప్పి అచటినుండి కదలితిని. పిమ్మట, కోపముతో ఎఱ్ఱబడిన కండ్లుగల ఒక రాక్షసస్త్రీ కడలిలోనుండి బయటకు తేలి, నీటిమీఁద పఱచుకొని యున్న నా నీడను పట్టి, ఆకాశములో ఎగురుచున్న నన్ను ఆపినది.

**కం. ధర సింహిక యను పేరిట**
**బరఁగెడు దానిని మదీయ । బలమున నడఁపన్**
**సురలు భవదాదరంబునఁ**
**గుఱిపించిరి నాపయి సుమ । కులమును రామా ! 74**

***లఘుటీక :*** *ధరన్ – లోకములో ; సింహిక అను పేరిటన్ – (సుబోధము) పరఁగెడుదానిని – విరాజిల్లుదానిని ; మదీయ – నా యొక్క ; బలమునన్ – బలముతో ; అడఁపన్ – అణఁచివేయఁగా ; సురలు – దేవతలు ; భవద్ + ఆదరంబునన్ – నీయందలి గౌరవము వలన; సుమకులమును – పూల మొత్తములను ; నాపయిన్ – నామీఁద ; కుఱిపించిరి – (సుబోధము).*

**తాత్పర్యము:** ఓ రామా! అది ప్రపంచప్రసిద్ధురాలైన సింహిక అను మహారాక్షసి.

దాని బలమును నా బలముతో అణఁచి చంపితిని. అంతట నీ సేవకుఁడనను ఆదరముతో దేవతలు నా మీఁద పూలవాన కుఱిపించిరి.

**కం. తరువాతఁ జేఱి లంకను**
**బురప్రతీహారి నసురి । భువి లంకాఖ్యన్**
**జఱచి యొక కేల నడఁచితి**
**నరసియు నాఁడుదని మనము । నందున రామా !** **75**

***లఘుటీక:*** *తరువాతన్ – తరువాత ; లంకను – లంకానగరమును ; చేఱి – చేఱి ; పురప్రతీహారిన్ – ఊరికి కావలియున్న ; అసురిన్ –* రాక్షసస్త్రీని*; భువిన్ – లోకములో ; లంకా+ఆఖ్యన్ – లంక అని పేరు కలిగినదానిని ; ఒక కేలన్ – ఒక చేతితో ; చఱచి – (సుబోధము) అడఁచితిన్ – ఓడించితిని; మనమునం దున్ – నా మనస్సులో ; ఆఁడుదని– ఆమె ఆఁడుదని ; అరసియున్–అను కొన్నప్పటికిని ;*

**తాత్పర్యము:** ఓ రామా! ఆ తరువాత లంకానగరమునకు చేఱితిని. దానిని లంక అను నొక రాక్షసి కావలి కాచుచుండెను. ఆమె నా మార్గమున కడ్డుపడి, నన్ను కొట్టఁగా నాకును పౌరుషము ప్రబలినది. 'ఆఁడుదాని దండింపనేటికి ?' అని మనస్సున నొకప్రక్క సంకోచపడుచునే, ఆమె నొక చేతితో చఱచి తన్మద మడంచితిని. పిమ్మట ఆ నగరమును చొచ్చితిని.

**కం. అతుల మహాహర్మ్య విత**
**త్యతిశోభితమైనయట్టి । దశకంఠ పురి**
**న్నితరంబు మఱచి తల్లిని**



**జతురంబుగ వెదకి వనర । సాఁగితి రామా !** **76**

***లఘుటీక :*** *అతుల –సాటిలేని ; మహా – గొప్ప ; హర్మ్య – భవనముల యొక్క ; వితతి – గుంపులతో ; అతిశోభితమైనయట్టి– మిక్కిలి శోభించుచు న్నదైన ; దశకంఠపురిన్– రావణాసురుని రాజధానిలో; ఇతరంబున్– వేఱు విషయము లను ; మఱచి – మఱచిపోయి ; తల్లినిన్ – జానకీమాతను ; చతురంబుగన్ – నేర్పుతో ; వెదకి – వెదకి ; వనరన్+సాఁగితిన్ – విచారింప సాఁగితిని.*

**తాత్పర్యము:** ఓ రామా! ప్రపంచమునం దెచ్చటను గానరాని గొప్ప ఎత్తైనభవన ములతో మిక్కిలి శోభించుచున్న ఆ లంకానగరములో తదేకాగ్ర శ్రద్ధతో నా చేతనయినంత సీతమ్మను వెదకి, ఆమె కానరాక విచారము నొందసాఁగితిని.

**కం. అంతట నెమకి యశోక వ**
**నాంతరమున నొక్కచక్కి । నరయమిని వడిన్**
**గెంతికొని కంటి నట ర**
**క్షోఽన్తర్వలయైకనిలయ । క్షోణిజ రామా !** **77**

***లఘుటీక:*** *అంతట – అన్నిచోటులలోను ; నెమకి – వెదకి ; అశోకవన + అంతరమునన్ – అశోకవనమనెడి తోఁట లోపల ; ఒక్కచక్కిన్ – ఒకచోట ; అర యమిని – చూడకపోవుటచేత ; అటన్ – అక్కడ ; రక్షః+అంతః+వలయ ం + ఏక నిలయన్ = రాక్షసుల వలయపు మధ్యప్రదేశమే నివాసముగాఁ గలిగిన ; క్షోణిజన్ – సీతను ; కంటిన్ – చూచితిని.*

**తాత్పర్యము:** ఓ రామా! అన్ని ప్రదేశములలోనను వెదకినను, అశోకవనమును చోటెక్కటి మట్టుకు చూడకపోవుట చేత అచటకు వెడలి అక్కడ సీతమ్మవారిని చూచితిని. ఆమె చుట్టుత రాక్షసస్త్రీలు కావలిగా నుండిరి.

**కం. ఆ రావణుఁ డయ్యజ్జన**
**భూరితర నిజ పరివార । భూషితుఁడై వాః**
**పూరిత రాజీవాక్షిని**
**దూఱెను బరిపరివిధముల । దుష్టుఁడు రామా !** **78**

***లఘుటీక*** *: ఆ+అజ్జునన్ – ఆ సమయమున ; దుష్టుఁడు – దుర్మార్గుఁడైన ; ఆ రావణుఁడు – (సుబోధము) ; భూరితర – గొప్పదైన ; నిజ పరివార – తన పరివారముచేత ; భూషితుఁడై – గౌరవింపఁబడుచున్నవాఁడై (వచ్చి) ; వాః+ పూరిత– నీటితో నిండి న ; రాజీవ+అక్షినిన్ – కనుఁదమ్ములు గల సీతన ు ; దూఱెను –దూషించెను.*

**తాత్పర్యము:** ఓ రామా! అప్పుడా దుర్మార్గ రావణాసురుఁడు విస్తారమైన పరివారము తనను కొలుచుచు వెంట నడువఁగా వచ్చి, సీతమ్మను బెదిరించి దూషించెను. వాని మాటలు విని ఆ సాధ్వి, కలువలవంటి తన కన్నులలో కన్నీరు నించెను.

**కం. ''ఇఱుమాసంబుల గడువే**
**తరళాక్షికి మిగిలె'' ననుచుఁ । దన బలచరితల్**
**గరువమునఁ జాటు నసురను**
**మఱపించి కొనిచనె ధాన్య । మాలిని రామా !** **79**

***లఘుటీక*** *: ఇఱుమాసంబుల గడువే – రెండునెలల వ్యవధానమే ; తరళాక్షికిన్ – చంచలములగు కన్నులుగల సీతాదేవికి; మిగిలెన్ – మిగిలినవి : అనుచున్ – అనుచు ; తన – తన యొక్క ; బలచరితల్– బలమును, చరిత్రమును, మఱియు శీలమును ; గరువమునన్– గర్వముతో ; చాటు– ప్రకటించుకొనుచున్న ; అసురను – రాక్షసరాజును ; ధాన్యమాలిని – ధాన్యమాలిని అను పేరుగల ఒక భార్య ; మఱపించి – కోపమును మఱచిపోవునట్లుగా చేసి ; కొని – చేయిపట్టి తీసికొని ; చనె – వెడలెను.*

**తాత్పర్యము:** ఓ రామా! ఆ రాక్షసరాజు సీతమ్మవారి యెదుట తన బలపరాక్రమములను, చరిత్రమును ఉగ్గడించుకొనెను. పిదప సీతమ్మ తనను భర్తగా అంగీకరించుటకింకను రెండునెలలే గడువున్నదని వాఁడు కూసెను. వాఁడట్లు కూయుచుండఁగా, వాని భార్యలలో ఒక్కతె యగు ధాన్యమాలిని, వాని చేయి పట్టుకొని, "మహారాజా ! ఈ మానవస్త్రీతో నీకెందుకు ?" అని వగలొలుకుచు, వానిని మఱపించి, మురిపించి, తీసుకొని వెడలెను.

**కం. ఆ కుత్సితుఁ డేఁగుటయు స**
**దాకర్ణ్యంబుగ భవత్క । థానుక్రమమ్ముఁ**
**జేకూడఁ బాడఁదొడఁగితి**
**నీ కాంతకు నెడఁద నింపు । నింపఁగ । రామా !** **80**

***లఘుటీక:*** *ఆ కుత్సితుఁడు– నింద్యమైన నడత గలవాఁడైన ఆ రావణుఁడు ; ఏఁగుటయుఁ – వెడలిపోయిన తరువాత ; సత్+ఆకర్ణ్యంబుగఁ – సజ్జను*

*లకు శ్రవణపేయముగా ; భవత్+కథా+అనుక్రమమున్ – వరుసగా నీ చరిత్ర మును; చేకూడన్ – నాకు దొఱకినంత (ఎఱుకైనంత) మట్టుకు ; పాడన్+ తొడఁగితిన్ – పాడసాఁగితిని ; నీ కాంతకున్ – నీ భార్యయైన సీతాదేవికి ; ఎడఁదన్ – హృదయమునందు ; ఇంపునింపఁగన్ – మాధుర్యమును నింపు నట్లు.*

**తాత్పర్యము:** ఓ రామా! దుష్టవర్తనుఁడైన ఆ రావణుఁడు వెడలిన అదను కాచి, నేను సజ్జనులకు శ్రవణానందమును గలిగించు నీ చరిత్రమును నాకు తెలిసినంతమట్టుకు, సీతమ్మ మనస్సునకు నచ్చునట్లు పాడసాఁగితిని.

**కం. ఐనను, "దానవపతినో,**
**కానియెడల వాఁ డనిపిన । కాపురుషుఁడనో,**
**నే" నని మది విశ్వాసం**
**బూనక శంకించె నన్ను । నువిద యు రామా ! 81**

***లఘుటీక**: ఐనను – ఐనప్పటికిన్ని ; దానవపతినో – నేను రాక్షసులకు రాజైన రావణాసురుఁడనో ; కాని యెడలన్ – లేనిచో : వాఁడు – వాఁడు ; అనిపిన – పంపిన ; కాపురుషుఁడనో – (మఱియొక) దుష్టుఁడనో ; అని – అని; మదిన్ – తన మనస్సులో ; విశ్వాసంబు+ఊనక – నమ్మకము పెట్టుకొనక ; నన్ను – నన్ను ; ఉవిదయున్– స్త్రీ (సీతాదేవి) సైతము; శంకించెన్– అనుమానించెను.*

**తాత్పర్యము:** ఓ రామా! నీ కథాగానము తన కానందమును కలిగించుచున్న ను తొలుత సీతమ్మ నన్ను నమ్మినదికాదు.'నేను వానరరూపములోని రావణుఁడనో, లేక వాఁడు పంపిన వేఱొక దుష్టరాక్షసుఁడనో ?' అని అనుమానించెను.



**కం. నీవిచ్చిన యుంగర మే**
**నా వైదేహికి నొసంగ । నమ్మెను నను ; నే**
**నా వైఖరిఁ గొంత తడవు**
**సేవకభావమున భాష । సేసితి రామా ! 82**

***లఘుటీక**: ఉంగరము+ఏన్ – ఉంగరమును నేను ; ఆ వైదేహికిన్ – ఆ సీత మ్మకు ; ఒసంగన్ – ఇవ్వఁగా ; ఆ వైఖరిన్ – ఆ తీరుగా ; కొంత తడవు – కాసేఁపు ; సేవకభావమునన్ – సీతాదేవికి నేను సేవకుఁడనను భావముతో ; భాష + చేసితిన్ – మాటలాడి తిని.*

**తాత్పర్యము:** ఓ రామా! నీవు నాకిచ్చిన ఉంగరమును నేను సీతమ్మకివ్వఁగా అప్పుడామె 'నన్ను నీ దూత' అని నమ్మెను. ముందు నీ కథను గానము చేసిన దాస్యభావముతోఁడనే నేనామెతో కొంతసేపు మాటలాడితిని.

**కం. నా మూఁపున వైదేహిని**
**క్షేమముగాఁ గొందుననుచుఁ । జెప్పఁగ సతి నా**
**భీమబలము శంకించెను ;**
**వ్యోమమున కెదిగితి శంక । వోవఁగ రామా ! 83**

***లఘుటీక**: నా మూఁపునన్ – నా వీఁపునకు పైభాగములో ; వైదేహిని – సీతవ మ్మ ను ; క్షేమముగాన్ – భద్రముగా : కొందున్+అనుచున్ – తీసికొని పోయెద ను అని ; చెప్పఁగన్ – చెప్పఁగా ; సతి – ఆ మహాసాధ్వి ; నా భీమబలమున్ –*

నా భయంకర బలమును ; శంకించెను – అనుమానించెను ; శంక+పోవఁగఁ – ఆమె అనుమానము తీఱునట్లు ; వ్యోమమునకుఁ – ఆకాశము వఱకు ; ఎదిగితిఁ – పెఱిగినాను ;

**కం. ఆమెయు నిజకేశాంత**
**స్సోమచ్ఛవిజాలనిత్య । శోభితమణి నీ**
**కీమని యిచ్చెను భక్త**
**స్తోమావనభూరికార్య । శూరా ! రామా ! 84**

***లఘుటీక*** *: ఆమెయు – ఆ సీతమ్మ కూడ ; నిజ కేశ+అంతః – తన తల వెంట్రుకల మధ్య ఉన్న ; సోమ+ఛవి–జాల – చంద్రుని వెన్నెలవంటి కాంతి పుంజములతో ; నిత్య – ఎల్లప్పుడును ; శోభిత– శోభించుచున్న ; మణి– రత్నమును ; నీకు+ఈమని – నీకిమ్మని ; భక్త స్తోమ+అవన – భక్తుల గుంపులను రక్షించుట అను; భూరికార్య–పెద్దపనిలో ; శూరా–సమర్థుఁడైనవాఁడా ! ఓ శ్రీరామచంద్రా!*

**తాత్పర్యము:** ఓ రామా! అప్పుడామె తన తలవెంట్రుకల మధ్య ఎల్లప్పుడును వెన్నెలకాంతులతో విరాజిల్లుచున్న చూడామణిని తీసి నీకిమ్మని చెప్పుచు నా కిచ్చెను.

**కం. వెండియు దుష్కాకాసుర**
**భండనకథ నామె నాకుఁ । బలికిన పిదపఁ**
**జండజవంబున వీడ్కొని**
**నిండగు వనతోరణమున । నిలచితి రామా ! 85**



***లఘుటీక*** *: వెండియుఁ – మఱియును (ఆ తరువాత) ; దుః+కాక+అసుర – దుష్టుఁడైన కాకాసురుఁడను రాక్షసుని ; భండనకథఁ – అణఁచిన వైనమును ; ఆమె – ఆ సీతమ్మ ; నాకుఁ – నాకు ; పలికిన పిదపఁ – చెప్పిన తరువాత ; వీడ్కొని – ఆమెకు వీడుకోలు చెప్పి ; చండ జవంబునఁ – భయంకరమైన వేగముతో ; నిండు+అగు – కళ గలిగిన ; వనతోరణమునఁ – అశోక వనపు ప్రవేశద్వారముపై ; నిలచితిఁ – నిలఁబడితిని.*

**తాత్పర్యము:** ఓ రామా! అంతయే కాక, నీవు కాకాసురుఁ డనువాని తులువ తనమునకు కినిసి, వాని మదము నణఁచిన వృత్తాంతమును సీతమ్మ నాకు వినిపించినది. పిమ్మట నేనామెకు వీఁడుకోలు పలికి ప్రచండ వేగముతో అశోక వనపు అందమైన ప్రవేశద్వారము మీఁదకు కుప్పించి ఎగసి నిలఁబడితిని.

**కం. ఎక్కిన ననుఁ గని కొందఱు**
**రక్కసు లేతేఱ భూరి । రణరంగమునం**
**దుక్కుమిగిలి వారి యొడల్**
**వ్రక్కలు సేసితి నితరులు । వాఱఁగ రామా ! 86**

***లఘుటీక*** *: రక్కసులు – రాక్షసులు ; ఏతేరఁ – రాఁగా ; ఉక్కుమిగిలి – బలము అతిశయింపఁగా ; వారి+ఒడల్ – వారి శరీరములను ; వ్రక్కలు+ చేసి తిఁ – ముక్కలు చేసితిని ; ఇతరులు+పాఱఁగఁ – మిగిలిన రాక్షసులు పారిపోఁగా.*

**తాత్పర్యము:** ఓ రామా! నన్ను చూచి కొందఱు రాక్షసులు నాతో పోరుటకునై రాఁగా వారికిని, నాకును పెద్దయుద్ధము జఱిగినది. అందులో నేను పెక్కంద్ర

శరీరములను ముక్కలు చేయఁగా తక్కుంగలవారు పారిపోయిరి.

**కం. హతశేషులు చని లంకా**
**పతి మ్రోలన్ నన్నుఁ గూర్చి । పలుకఁగ నాతం**
**డతికోపంబునఁ బంపెను**
**వెత నక్షకుమారనామ । వీరుని రామా !** **87**

***లఘుటీక*** *: హతశేషులు – చావఁగా మిగిలినవారు ; లంకాపతి మ్రోలన్ – లంకారాజ్యమునకు రాజైన రావణాసురుని యెదుట ; వెతన్ – వ్యథతో ; అక్ష కుమార నామ – అక్షకుమారుఁడను పేరు గల ;*

**తాత్పర్యము:** ఓ రామా! పారిపోయినవారు రావణుని కడకేఁగి, నా బలపరాక్ర మాదులను మఱియు నేను చేసిన వనవిధ్వంసమును వర్ణించి చెప్పఁగా, వాఁ డతికోపముతో అక్షకుమారుఁడను వీరుని నామీఁదకు పంపెను.

**కం. ఆ యక్షకుమారుఁ డసువుఁ**
**బాయఁగఁ గ్రోధోగ్రభూత । భావన లంకా**
**నాయకుఁ డంపెను సేనా**
**నాయకులేవురను ; వారి । నణఁచితి రామా !** **88**

***లఘుటీక****: అసువుల్+పాయఁగన్– ప్రాణములను విడువఁగా ; క్రోధ+ఉగ్ర భూతభావనన్ – కోపము చేత ఉగ్రమైన బుద్ధితో ; లంకానాయకుఁడు – లంకకు రాజైన రావణాసురుఁడు ; అంపెను – పంపెను ; ఏవురను – ఐదు గురిని.*



**తాత్పర్యము:** ఓ రామా! నేనా అక్షకుమారుని సహితము వదలకుండ వధించి తిని. ఆ వార్త విని ఆ రావణుఁడు కోపముచేత తన మనస్సు ఉగ్రము కాఁగా, ఇంకను ఐదుగురు సేనాపతులను నా మీఁదకు పంపెను. నేను వారిని సహిత ము దునుమాడవలసెను.

**కం. పఱచినవారా రావణు**
**సరసకుఁ జని నా పనులను । జాటుడు నతఁ డు**
**త్తరనిమిషమే పనిచె నే**
**డ్గురు మంత్రుల యనుఁగుముద్దు । కుఱ్ఱల రామా !** **89**

***లఘుటీక*** *: పఱచినవారు – పారిపోయినవారు ; సరసకున్ – దగ్గఱకు ; చని – వెడలి ; చాటుడున్ – ప్రకటింపఁగా ; ఉత్తర నిమిషమే – మఱుక్షణములో ననే ; పనిచెన్– పంపెను; అనుఁగు– ప్రియమైన; ముద్దుకుఱ్ఱలన్– ముద్దు కుమారులను.*

**తాత్పర్యము:** ఓ రామా! వారు చావఁగా మిగిలినవారు మఱల రావణుని దగ్గ ఱకు పోయి, నా పనులను గూర్చి వెల్లడింపఁగా, వాఁడాలస్యము చేయక వెం టనే తన మంత్రుల ప్రియకుమారులైన ఏఁడుగురు కుఱ్ఱవాండ్రను నా మీఁద కు పంపెను.

**కం. తద్దయు బలియులమని వా**
**రద్దురమున జంబుమాలి । కనుచరులగుచున్**
**బెద్దయుఁ బ్రొద్దున కావలఁ**
**బెద్దనిదుర వోయిరి పెను। పెనఁకువ రామా !** **90**

***లఘుటీక***: *తద్దయుర్ – మిక్కిలి ; బలియులము+అని – బలవంతులమని ; ఆ+దురమునన్– ఆ యుద్ధమునందు; పెద్దయుర్+ప్రొద్దునకుర్– చాల సేఁపటికి ; ఆవలన్ – అవతల (పిమ్మట) ; పెద్దనిదుర+పోయిరి – చనిపోయిరి ; పెను+పెనకువన్ – గొప్ప పోరాటములో.*

**తాత్పర్యము:** ఓ రామా! వారు జంబుమాలి అనువాని నేతృత్వమున గొప్ప బలవంతులమని గర్వించుచు వచ్చిరి. చాలసేఁపు మా మధ్య భీకరమైనయుద్ధము ప్రవర్తిల్లిన పిమ్మట వారందఱును (నా చేతిలో) చనిపోయిరి.

**కం. చివఱకు శఠుండు మాయా**
**హవకరుఁడగు నింద్రజిత్తుఁ । డను రావణజుం**
**డవలీల నన్నుఁ గట్టెను**
**శివమౌ బ్రహ్మాస్త్రము నిర । సింతునె ? రామా !** 91

***లఘుటీక***: *శఠుండు–ధూర్తుఁడు; మాయా + ఆహవకరుఁడు – మాయా యుద్ధము చేయువాఁడు ; రావణజుండు – రావణాసురుని కుమారుఁడు ; అవలీలన్ – మిక్కిలి సులభముగా; శివమౌ–పవిత్రమగు ; నిరసింతునె– త్రోసిపుచ్చుదునా ?*

**తాత్పర్యము:** ఓ రామా! చివరకు ఇంద్రజిత్తనువాఁడు వచ్చెను. వాఁడు రావణుని కుమారుఁడు. రాక్షసమాయలతో యుద్ధముచేయుటలో వానిది అందెవేసిన చేయి. కనుక బ్రహ్మాస్త్రమేసి నన్ను బంధింపఁగలిగెను. వరప్రభావముచేత నేను దానిని కూడ వదిలించుకొనఁగలను. కాని పితామహునందలి భక్తిగౌరవములను పురస్కరించుకొని ఆదరసూచకముగా నేను దానికి కొంతసేఁపు కట్టుపడితిని.



**కం. ఉద్ధతి రావణుఁ డప్పుడు**
**బద్ధుండనయిన ననుఁ గని । పలికెను గోపా**
**రుద్ధగ్రీవుఁడు జగతీ**
**శుద్ధుఁడవగు నిన్నుఁ గూర్చి । సొడ్డులురామా !** 92

***లఘుటీక***: *ఉద్ధతిన్ – అహంకారముతో ; బద్ధుండన్+అయిన – కట్టివేయఁబడినవాఁడ నైన ; కోప+ఆరుద్ధ గ్రీవుఁడు – కోపముచేత పూడుకొనిపోయిన గొంతుగలవాఁడు; జగతీశుద్ధుఁడవు + అగు–లోకములన్నింటికిని పవిత్రుండ వైన ; సొడ్డులు – వక్రవాక్యములు.*

**తాత్పర్యము:** ఓ రామా! అట్లు బ్రహ్మాస్త్రమునకు కట్టుపడిన నన్నింద్రజిత్తు తన తండ్రియైన రావణుని కొల్వుకూటమునకు గొంపోయెను.అచ్చట రావణుఁడు నా వివరములను తెలియఁగోరి తన మంత్రియైన ప్రహస్తునిచేత అడిగించెను. ఆ సందర్భములో వాఁడహంకరించి, కోపమువలన బొంగురుపోయిన గొంతుతో లోకపావనుఁడవైన నిన్ను గుఱించి వక్రవాక్యములు పలికెను.

**కం. ఆ యదనున నే లంకా**
**నాయకుఁ గని నీ బలిమియు । నా చరితయు మీ**
**జాయ మహామహిమంబును**
**బాయక వివరించితి నతి । పావన రామా !** 93

*లఘుటీక : ఆ+అదనునన్ – ఆ తరుణములో ; ఏన్ – నేను ; మీ జాయ – నీ భార్యయైన సీతాదేవి యొక్క; మహా– గొప్పదైన మహిమంబును – మాహాత్మ్యమును ; పాయక – విడువక.*

**తాత్పర్యము:** ఓ రామా ! నేనప్పుడు రావణుని జూచి, నీ బలపరాక్రమముల ను, నా వివరములను, సీతామహాసాధ్వి మాహాత్మ్యమును పూసగ్రుచ్చినట్లు వానికి వివరించితిని.

**కం. నీ లీలల నా రావణుఁ**
**డాలింపను జాలక నను । హతమార్పఁగ దా**
**సాళికి ననుజ్ఞ నొసఁగుడుఁ**
**జాలని వారించె వాని । సహజుఁడు రామా !** **94**

*లఘుటీక : ఆలింపను+చాలక – వినలేక ; హతము+ఆర్పఁగన్ – చంపుటకై ; దాస+ఆళికిన్ – సేవకుల వర్గమునకు; అనుజ్ఞన్ – ఆజ్ఞను; ఒసఁగుడున్ – ఇవ్వఁగా ; వారించెన్ – ముందే అడ్డుకొనెను ; సహజుఁడు – సోదరుఁడు.*

**తాత్పర్యము:** ఓ రామా! నేనట్లు వర్ణించుచున్న నీ లీలావిశేషములను విని, ఆ రావణుఁడు సహింపఁజాలక, నన్ను వధింపవలసినదని తన సేవకులకాజ్ఞ నివ్వఁగా, "అన్నా ! దూతను జంపుట అధర్మ" మని వాని సోదరుఁడయిన విభీష ణుఁడనువాఁడు అడ్డుపడెను.

**కం. అంతట నన్నుం జంపక**
**చెంతం గల రక్కసులొక । చెకుముకి మద్వా**
**లాంతమున రాఁచి తన్నగ**
**రాంతరమునఁ ద్రిప్పుచు ననుఁ । జాటిరి రామా !** **95**



*లఘుటీక: చెంతన్+కల–దగ్గఱలో నున్న; చెకుముకిన్–తననంటి మఱియొక ఱాతిముక్కకు చేర్చి ఱాఁచినప్పుడు నిప్పుఱవ్వలను పుట్టించు లక్షణము గల ఒక ఱాతిని* (**పూర్వము నిప్పును రాజవేయుటకై దీనిని దూది వంటి సద్యో దహనశీలము గల పదార్థములతో కలిపి రాఁపిడి చేసెడివారు**)*; మత్ + వాల + అంతమునన్ – నా యొక్క తోఁక చివఱ; తత్+నగర + అంతరమునన్ – ఆ నగరములోపల.*

**తాత్పర్యము:** ఓ రామా! అంతట వాఁడు తాను తొలుత ఇచ్చిన ఆజ్ఞ నుపసం హరించుకొని, నా తోకకు నిప్పటించి నగరమందెల్లెడల నా అకృత్యములను చాటుచు త్రిప్పుండని పార్శ్వచరుల కాజ్ఞాపించెను. అప్పుడు వారట్లే చేసిరి.

**కం. భవదస్త్రంబునకు మనా**
**గవసరమే కట్టువడెద । నని మున్నే వా**
**గ్ధవునకుఁ జెప్పిన చొప్పున**
**జవదాఁటితి నస్త్రపాశ । జాలము రామా !** **96**

*లఘుటీక: భవత్+అస్త్రంబునకున్– నీ బాణమునకు ; మనాక్+ అవసరమే – కొంచెము సేపే ; వాక్+ధవునకున్– సరస్వతీదేవికి మగఁడైన బ్రహ్మదేవునికి ; మున్ను+ఏన్– ఇంతకుముందు నేను ; చెప్పిన చొప్పునన్– చెప్పిన ప్రకారము ; జవదాఁటితిన్– అధిగమించితిని (విదిలించుకొని విముక్తుఁడనైతిని); అస్త్ర పాశ జాలమున్– బ్రహ్మాస్త్రమనెడి త్రాళ్ళ అల్లికను.*

**తాత్పర్యము:** ఓ రామా! బ్రహ్మాస్త్రమునకు కొంతసేపే కట్టుపడెదనని పూర్వము బ్రహ్మకిచ్చిన మాటప్రకారము నేనా అస్త్రబంధమును విదిలించుకొని బైట పడితిని.

**కం. ఆన్నగరంబును మద్వా**
**లోన్నతకీలలను గాల్చి । యుంచితి సభలో**
**నన్ను సమయింపవలదని**
**యన్న విభీషణనిశాటు । హర్మ్యము రామా !** **97**

***లఘుటీక:*** *ఆ+నగరంబును – ఆ నగరమును ; మత్+వాల+ఉన్నత కీలలను – నా తోఁకనుండి యెత్తుగా ఎగయుచున్న అగ్నిజ్వాలలతో ; ఉంచితిన్ – దహనము చేయకుండ క్షేమముగా ఉంచితిని ; సమయింపవలదని – చంపవద్దని ; అన్న – అనిన ; విభీషణ నిశాటు – విభీషణుఁడను* రాక్షసుని *యొక్క ; హర్మ్య మును – రాజసౌధమును.*

**తాత్పర్యము:** ఓ రామా! ఆ తరువాత ఆకాశమునకెగసి, ఆ లంకపై అంతటను సంచరించుచు, నా తోఁక నుండి ఉవ్వెత్తున లేచుచున్న మంటలతో ఆ నగరమందలి భవనములన్నింటికిని నిప్పుపెట్టితిని. కాని, దూతనైన నన్ను చంపుట అధర్మమని వారించిన రావణ సహోదరుఁడైన విభీషణుని రాజసౌధమును మాత్రము కాల్పక విడిచి పెట్టితిని.

**కం. తరువాత లంకనంతయు**
**ఖరాగ్నిహేతులను ద్రొబ్బి, । "కాశ్యపిజయు దు**



**ర్భర వైశ్వానర శిఖలను**
**మరణించిన నే గతి ?" యని । మఱలితి రామా !** **98**

***లఘుటీక:*** *ఖర+అగ్నిహేతులను – తీక్ష్ణమైన వేఁడిమి గల అగ్నిజ్వాలలలో ; ద్రొబ్బి – త్రోసి ; కాశ్యపిజయున్ – సీతాదేవి కూడ ; దుర్భర – భరింపరాని ; వైశ్వానర శిఖలను – అగ్నిజ్వాలలలో ; మరణించినన్ – చనిపోయినచో ; ఏ గతి+అని – ఏమిటి గతి ? అనుకొనుచు ; మఱలితిన్ – విరమించితిని.*

**తాత్పర్యము:** ఓ రామా! అట్లా లంకానగరమును అగ్నిజ్వాలల వేఁడిమిలోత్రోసి, "అయ్యో ! శత్రువుల పైని ద్వేషముతో వారి నగరమును తగులఁబెట్టుచున్నాననుకొంటిని గాని ఈ దుర్భరమైన మంటలలో సీతాదేవి కూడ చనిపోయినచో ఇఁక ఏది దారి ?" అని పరితపించినవాఁడనై, తిరిగి ఆమె ఉన్నచోటికి వెడలి చూచితిని.

**కం. మఱలి యశోకవనంబున**
**నురుశింశుప క్రింద నామె । యుండుటఁ గని ''త**
**ల్లిరొ క్షేమమె నీ ?'' వని త**
**త్పరమ శుభాశీస్సులడిగి । పడసితి రామా !** **99**

***లఘుటీక:*** *ఉరుశింశుప– పెద్దశింశుపావృక్షము; తల్లిరొ– ఓ తల్లీ ; తత్+పరమ శుభ+ఆశీస్సులు– ఆమెయొక్క గొప్ప శుభదీవెనలు ; పడసితిన్ – పొందితిని.*

**తాత్పర్యము:** ఓ రామా! అక్కడ ఆ శింశుపావృక్షము క్రింద ఆమె క్షేమముగానే ఉండుట చూచి సంతసించి, ఆమె క్షేమసమాచారము విని, పిదప ఆమెశుభాశీ

ర్వచనములను కోరిపొందితిని.

**కం. పరువడి విజయోత్సాహం**
**బురవడి నుప్పొంగ నతిశ । యోహలు నిండ౯**
**ద్వరితగతి మఱలి నిజ వా**
**నరమిత్రంబులను జేటి । నానో రామా ! 100**

*లఘుటీక: పరువడి – మఱల ; ఉరవడి౯ – వఱద ఉద్ధృతి వలె ; నిజ – (తన) నాయొక్క.*

**తాత్పర్యము:** ఓ రామా! తరువాత కార్యసిద్ధిచే ఉత్సాహము వఱద వలె ఉద్ధృతముగా ఉఱకలెత్తఁగా, గొప్పగొప్ప భావిపథకములతో మనస్సు నిండఁగా, త్వరగా వెనుదిరిగి, ఆకాశమార్గమున ప్రయాణించి, నా రాక కెదురుసూచుచున్న మా వానరమిత్రముల కడకు చేఱుకొంటిని.

**కం. ఆ యూఁపున నేఁగి యనే**
**కాయుతసంఖ్యలను మధువ । నాఖ్యముఁ జొటి పల్**
**కాయలుఁ బండ్లును మధువులు**
**మేయోపినయన్ని తింటి । మెసలిక రామా ! 101**

*లఘుటీక : అనేక+అయుత సంఖ్యలను – కొన్నిలక్షల సంఖ్యలో ; మధువన+ఆఖ్యము౯ – మధువనము అనెడి తోఁటలో ; చొజి – ప్రవేశించి ; పల్ – పెక్కు ; మధువులు౯– తేనెలు కూడ; మే– (మా) శరీరములు; ఓపినయన్ని – భరింపఁ గలిగినన్ని ; ఎసలిక౯ – ఉత్సాహముతో.*



**తాత్పర్యము:** ఓ రామా! సీతమ్మవారి జాడ తెలిసినదన్న ఉత్సాహముతో లక్షలాదిగా ఉన్న మేమందఱము మధువనమను పెద్దతోఁటలో ప్రవేశించి, మా పొట్టలు నిండునట్లుగా అక్కడి కాయలను, పండ్లను తిని తేనెలను త్రాగితిమి.

**కం. ఆ తరువాతి ఘటనవిధ**
**మే తీరో నీ వెఱుఁగుదు ; వేఁ జెప్పఁగ నే**
**లా ? తీసికొనుము రాఘవ !**
**సీతాదత్తమగు మణి వి । శేషము రామా ! 102**

*లఘుటీక : ఘటనవిధము– సంఘటనలు జఱిగిన విధానము; ఏ౯+చెప్పఁగ౯+ ఏలా – నేను చెప్పుటెందుకు ? సీతాదత్తమగు – సీతాదేవిచే ఇవ్వఁబడిన; మణి విశేషము౯ – మణులలో ప్రత్యేకమైనదానిని.*

**తాత్పర్యము:** ఓ రామా! ఆ తరువాత జఱిగిన ఘటనలన్నియు నీవే యెఱుఁగుదువు. నేను ప్రత్యేకించి చెప్పుట యెందులకు ? ఇదిగో సీతమ్మ యిచ్చిన చూడామణి, తీసికొనుము.

**కం. అని మారుతి నీకంబుజ**
**ము నిచ్చి ప్రణమిల్ల నెత్తి । మోదముతో, ''నా**
**యనుజుఁడు భరతునికి నీ**
**వనురూపుండ'' వను నీకు । నర్పణ రామా ! 103**

*లఘుటీక : మారుతి – హనుమంతుఁడు; అంబుజము౯ – రత్నమును ; ప్రణమిల్ల౯– మోఁకరిల్లగా; మోదముతో౯– సంతోషముతో ; అను జుఁ*

డు – తమ్ముఁడైన; అనురూపుండవు– సరిపోలినవాఁడవు/సాఁటివచ్చువాఁడ వు/సమానుఁడ వు; అర్పణ– నివేదనము.

**తాత్పర్యము:** ఓ రామా! ఆ విధముగా తన లంకాయాత్రను గూర్చియు, సీతా దర్శనమును గూర్చియు మారుతి నీకు విన్నవించి, నీకు చూడామణి నర్పించి నమస్కరించెను. అప్పుడు నీవాతనిని సంతోషముతో కౌఁగలించుకొని, "హను మా ! నీవు నాకు భరతునితో సమానము సుమా !" అని చెప్పితివి. అట్టి నీకు మా వాజ్నైవేద్యము.

**కం. తరువాతఁ బూనికను వా**
**నర సైన్యానూన శక్తి । నంభోనిధికిౕ**
**గురుసేతువు నిర్మింపఁగ**
**ద్వర వార్ధిని వేఁడు నిన్నుఁ । దలఁగను రామా !** **104**

***లఘుటీక*** *: పూనికను – ప్రయత్నముతో ; వానరసైన్య – కోఁతుల పటాలవు ; అనూనశక్తిౕ– మహాబలము సాహాయ్యమున; అంభోనిధికిౕ–సముద్రమునకు ; గురుసేతువుౕ– పెద్ద వంతెన ను; వార్ధిని– సముద్రదేవుని; తలఁగను– విడిచిపెట్టను.*

**తాత్పర్యము:** ఓ రామా! పిమ్మట లంకకుఁ బోవుటకై వానరసైన్యముల భుజ బలసహాయముతో సముద్రము మీఁద వంతెన కట్ట నిశ్చయించితివి. అందు నిమిత్తము కట్టుబడిఱాళ్ళను నీటిపై తేల్పవలసినదని నీవు సముద్రుని ప్రార్థించితివి.



**కం. ఎవ్వని జంకెనల వలన**
**నవ్వననిధి వణఁకుదేఱి । ''యతికఠినశిలల్**
**నెవ్వక తేలింతు'' ననెనొ**
**యవ్వీరుఁడవైన నీకు । నర్చన రామా !** **105**

***లఘుటీక*** *: జంకెనల వలన– భయపెట్టు మాటలచేత ; ఆ+వననిధి – ఆ సముద్రవు; వణ ఁకుదేఱి– కంపించిపోయి ; అతి కఠిన శిలల్– మిక్కిలి గట్టిగానున్న బండఱాళ్ళను ; నొవ్వక – ఏ బాధయు పడకుండ ; అర్చన – పూజ.*

**తాత్పర్యము:** ఓ రామా! నీవట్లు ప్రార్థించినప్పటికిన్ని ఆ సముద్రుఁడు మాఱు పలుకఁడయ్యె. అంతట నీవు క్రోధించి, "ఈ సముద్రుని నా బాణాగ్నితో ఎండ గట్టెద" నని విల్లెక్కుపెట్టఁగా, సముద్రుఁడు వణికిపోయి, "హే రామచంద్ర ప్రభో ! నీవు చెప్పినట్లే చేసెదను. బాణప్రయోగము నుపసంహరింపు" మని వేఁడుకొనెను. అంతట నీవా బాణమును సుదూరముగా కొందఱు పాపులను నిర్మూలము చేయుటకై మఱలించితివి. అట్టి నీకు మా అర్చనములు స్వామీ !

**కం. శరనిధి పలుకులకొప్పి య**
**మరశిల్పినిభుఁడగు నలకు । మారాఖ్యుఁ గప్తిౕ**
**బురుసేతువుఁ గట్టఁబనిచి**
**యరిపురమును జొచ్చు నీది । యగ్రత రామా !** **106**

***లఘుటీక*** *: శరనిధి – సముద్రవు ; పలుకులకు – మాటలకు ; ఒప్పి – ఒప్పు కొని; అమరశిల్పి– దేవతల స్థపతియైన విశ్వకర్మను; నిభుఁడు– పోలినవాఁడైన*

*నలకుమార+ఆఖ్యుఁ– నలకుమారుఁడను పేరుగలవానిని; పురుసేతువుఁ – గొప్పవంతెనను; కట్టఁ+పనిచి–కట్టుటకాజ్ఞాపించి; అరిపురమును– శత్రువుల నగరమును ; చొచ్చు – ప్రవేశించిన ; అగ్రత – వైశిష్ట్యము.*

**తాత్పర్యము:** ఓ రామా! నీవు సముద్రుని ప్రార్థన కొప్పుకొని, దేవతల శిల్పాచార్యుఁడు విశ్వకర్మవంటి నైపుణ్యముగల నలుఁడను వానరోత్తముని సేతువును నిర్మింపుమని ఆజ్ఞాపించితివి. అట్లు కట్టినసేతువుపై నడచుచు, లక ణాంజనేయ, సుగ్రీవులతోడను, తక్కుంగల వానరసైన్యములతోడను నీవు లంకానగరమునకు చేఱుకొంటివి. ఆహా ! నీ వైశిష్ట్యమే వైశిష్ట్యము తండ్రీ !

**కం. వావిరి నలువుఱు వెనుగొన**
**రావణుపై నలిగి నిను శ । రణ్యునిఁ గొలువం**
**గా వచ్చు విభీషణుని ద**
**యావృత్తిం బ్రోచు నీకు । నంజలి రామా ! 107**

***లఘుటీక:*** *వావిరిఁ– వ రుసగా; వెనుగొనన్– అన ుసరింపఁగా; అలిగి – కోపించి ; శరణ్యునిఁ–శరణము వేఁడఁదగినవాఁడుగా ; కొలువఁ–సేవించుట కై ; వచ్చు – వచ్చుచున్న; దయావృత్తిఁ– దయ గల స్వభావముతో; ప్రోచు– రక్షించిన ; అంజలి – జోహారు.*

**తాత్పర్యము:** ఓ రామా! నీకును, రావణ ునికిని నడుమ యుద్ధమారంభమ్మైనది. రావణుని మౌర్ఖ్యమును మెచ్చక ఆతని తమ్ముఁడైన విభీషణుఁడు నలుఁగుఱు అనుచరులతో సహా నీ కడకు వచ్చి శరణువేఁడఁగా నీ వభయమొసంగి



దఱిఁ జేర్చుకొంటివి. అట్టి ఆర్తత్రాణపరాయణుఁడవైన నీకు జోహారు ప్రభూ !

**కం. మాయాహవరంగంబున**
**నీ యనుజుఁడు త్రెళ్ళియుండ । నీరై కన్నుల్**
**తోయపు ధారల నిండ న**
**మేయంబుగ స్రుక్కు నీవు । మెత్తన రామా ! 108**

***లఘుటీక*** *: మాయా+ఆహవ రంగంబునఁ – మాయాబలముతో చేయఁబడుచున్న ఆ యుద్ధభూమిలో ; నీ+అనుజుఁడు – నీ తమ్ముఁడు ; త్రెళ్ళి+ఉండఁ – అపస్మారకములో పడిపోయి ఉండఁగా ; నీరై – నిరుత్సాహముతో నీరుగారిపోయి ; తోయపు ధారలఁ– నీటి సోనలతో; కన్నుల్– కండ్లు; నిండఁ– నిండఁ గా; అమేయంబుగఁ – విపరీతముగా/ మిక్కిలి ; స్రుక్కు – బాధపడిన*

**తాత్పర్యము:** ఓ రామా! మాయాయుద్ధవిశారదుఁడగు ఇంద్రజిత్తు నీ తమ్ముఁడైన లక్ష్మణస్వామిని అస్త్రప్రయోగముతో మూర్ఛబొందింపఁగా, ఆయన నేల మీఁద పడిపోయెను. ఆ సమయమునందు నీవు నిరుత్సాహముతో నీరుగారి, కన్నులనిండ కన్నీరుక్రమ్మఁగా మిక్కిలి బాధచెందితివి. మహా పరాక్రమవంతుఁడ వయ్యు, నీది సుతిమెత్తని మనస్సు కదా స్వామీ !

**కం. ప్రాతఃకాలములోపల**
**వాతాత్మజుఁ డోషధిగిరి । వఱచ ుచుఁ దేరఁ**
**శాతముగ దానఁ దమ్ము స**
**చేతనునిం జేయు నీకు । జేజే రామా ! 109**

***లఘుటీక:*** *ప్రాతఃకాలము – సూర్యోదయసమయము ; వాత+ఆత్మజుఁడు – హనుమంతుఁడు ; ఓషధిగిరి – సంజీవనీపర్వతమును ; పఱచుచుఁ – పరు గులిడుచు; తేరఁ– తేఁగా/ తీసుకొనిరాఁగా ; శాతముగఁ – సుఖముగా ; దానఁ – దానితో (దానియందున్న ఓషధులతో) ; సచేతనునిఁ – స్పృహ గల వానిగా ; జేజే – జయజయధ్వానములు.*

**తాత్పర్యము:** ఓ రామా! లక్ష్మణస్వామికి స్పృహ రావలెనన్న తెల్లవారులోపల సంజీవన్యోషధిని తేవలెనని వానరవైద్యులు తెలిపిరి. ఆ ప్రకారముగా దానిని తేఁబోయిన ఆంజనేయునకు ఆ పర్వతము మీఁద ఆ ఓషధి ఎక్కడ ఉండెనో అంతుపట్టదయ్యె. అంతట ఆయన కాలయాపనచేయక మొత్తము పర్వత మునే పెకలించుకొని వచ్చెను. ఆ ఓషధితో త్వరగా, తేలికగా లక్ష్మణస్వామికి తెలివి వచ్చెను.

**కం. చాతుర్యమేర్పడ సకల**
**భూతలము వడంకుఁదేఱ । భయకర రక్షో**
**వ్రాతకృత వికృతగర్జల**
**భీతిల్లక చంపు నీకు । బిరుదులు రామా !** **110**

***లఘుటీక:*** *చాతుర్యము + ఏర్పడఁ – నేర్పు బయటపడఁగా ; భూతలము – భూమియొక్క పైభాగము ; వడంకు+ తేఱఁ – వణుకును పొందఁగా ; భయ కర – వెఱపును గలిగించునట్టి ; రక్షః + వ్రాత – రాక్షస సమూహ ములచేత ; కృత– చేయఁబడిన ; వికృత– వికారమైన, కర్ణకఠోరమైన; గర్జలఁ– గర్జనలతో; భీతిల్లక– భయపడక ; బిరుదులు – ప్రశంసాపూర్వక పౌరుష నామములు.*



**తాత్పర్యము:** ఓ రామా! ఆ యుద్ధరంగములో భీకరముగా వికారపు సింహనా దములుచేయు మాయాయుద్ధవిశారదులయిన క్రూరరాక్షసుల ధాటికి వెఱు వక, నైపుణ్యముకలిగి, వారితో పోరాడి సంహరించిన నీ కనేక పౌరుష నామ ములు దేవా !

**కం. చదల సురలు తిలకింపఁగ**
**నదలించి పిడికిటి పోఁటు । నఁ దానవులఁ**
**సదమదము సేయు వానర**
**కదంబముల ముద్దుఁ దీర్పఁ । గంటివి రామా !** **111**

***లఘుటీక:*** *చదలఁ – ఆకాశములో ; సురలు – దేవతలు ;దానవులఁ – రాక్ష లను ; సదమదము సేయు – సమస్యలలో పెట్టు ; వానర కదంబములకుఁ – వానరుల సమూహములకు ; ముద్దుఁదీర్పఁ+కంటివి – అభీష్టములను నెఱ వేర్పఁగలిగితివి.*

**తాత్పర్యము:** ఓ రామా! ఆకాశమునందు స్వర్లోక దేవతలు గుమిగూడి చూచు చుండఁగా, రాక్షసులను అదిలించుచు, ఒక్క పిడికిటిపోటుతో వారిని హింసిం చిన వానరవీరులకు ఆ పిమ్మట కోరిన వరములిచ్చి సంతోషపెట్టితివి గదా స్వామీ !

**కం. దేవేంద్రప్రముఖులుఁ దమ**

**భావంబున నెవనిఁ దలఁచి । భయమొందెదరా**
**రావణు విభీషణోపా**
**యావధృతిం గెడపు నీ వ । నంతుఁడు రామా !** 112

***లఘుటీక*** *: దేవేంద్ర ప్రముఖులుర్ – దేవతల రాజైన ఇంద్రుఁడు మొదలైన వారు కూడ ; భయము+ఒందెదరు – భయమును పొందెదరు ; విభీషణ + ఉపాయ + అవధృతిర్ – విభీషణుఁడు చెప్పిన ఉపాయమును ఆలకించుట వలన : కెడపు – చంపిన.*

**తాత్పర్యము:** ఓ రామా! స్వర్లోక రాజైన దేవేంద్రుఁడు మొదలు దేవతలు సైత మెవ్వని స్మరించినంతమాత్రముననే భయపడెదరో ఆ రావణాసురుని – తన తమ్ముఁడు విభీషణుఁడు వెల్లడించిన ప్రాణరహస్యపు సహాయముతో సంహ రించిన నీవు సాక్షాత్తు విష్ణుమూర్తివి ప్రభూ !

**కం. అలఘుతరయశస్కుఁడవై**
**సలలితకరుణార్ద్రబుద్ధి । శత్రుపురమునం**
**దలి జనుల కసురుల కదో**
**షుల కభయమొసంగు నీకు । స్తుతులగు రామా !** 113

***లఘుటీక*** *: అలఘుతర – చిన్నది కానటువంటి ; యశస్కుఁడ వై – కీర్తి గల వాఁడ వై ; సలలిత – సున్నితమైన ; కరుణా – జాలిగుణముచేత ; ఆర్ద్ర – తడిసిన ; బుద్ధిర్ – మనస్సుతో ; అదోషులకుర్ – తప్పుచేయనివారికి ; స్తుతులగుర్ – స్తోత్రములు కలుగును.*

**తాత్పర్యము:** ఓ రామా! రావణాసురునంతటివానిని సంహరించిన గొప్పకీర్తిని సంసాధించి, ఏ అపరాధమును చేయని సామాన్య లంకానగర వాస్తవ్యుల కప కారము చేయక సున్నితమైన దయామయ హృదయముతో అభయమొసం గిన నీకు సదాకాలము స్తోత్రపాఠములు తండ్రీ !



**సీ. తదుపరి పూర్వక । థాఖ్యాపననిరతిఁ**
**బుష్పకారూఢిఁ బ్ర । పూతబుద్ధి**
**సుగ్రీవకేసరి । సుతముఖ్యులుర్ జన**
**కాత్మజ సౌమిత్రి । కదలిరాఁగ**
**భద్రైకశీలుఁడౌ । భరతుండు వసియించు**
**నందిగ్రామమున వ । న్యములగు జట**
**లుజ్జగించి యమాత్య । వజ్జనులు గొలిచి**
**రా నయోధ్యానగ । రం బనంత**

**తే.గీ. శాంతిమోదోత్సుకత్వాల । స్నానమాడ**
**వడిని బట్టాభిషిక్తుఁడ । వై జనులను**
**రోగదుర్భిక్షదుర్ణయ । యోగమేది**
**సౌఖ్యనియట్లేలు నీకు జో । హరులు రామ !** 114

***లఘుటీక*** *: తదుపరి – దాని తరువాత ; పూర్వకథా – అంతకుముందు జరి గిన వృత్తాంతములను ; ఆఖ్యాపన – చెప్పుకొనుటలోని ; నిరతిర్ – తత్పరత తో; పుష్పక+ఆరూఢిర్– పుష్పక విమానమును ఎక్కి ; ప్రపూతబుద్ధిర్– కలఁ తలు లేని ప్రశాంత మనస్సుతో ; సుగ్రీవ, కేసరిసుత, ముఖ్యులుర్ – సుగ్రీవుఁ డును, ఆంజనేయుఁడును మున్నగు ప్రధానవానరులును ;  జనక+ఆత్మజ–*

*జనకుని కూఁతురైన సీత ; సౌమిత్రి – లక్ష్మణస్వామి ; భద్ర + ఏక శీలుఁడౌ – స్నేహమే శీలముగాఁ గలవాఁడైన ; వన్యములగు జటలు – వనవాసులకే తగిన వైన జడలు ; ఉజ్జగించి – విడిచిపెట్టి ; అమాత్యవత్ – మంత్రు లు మున్నగు; జనులు – పరివార జనము ; కొలిచిరాఁ – సేవించుచు రాఁగా ; అనంత– అంతులేని ; శాంతి, మోద, ఉత్సుకత్వాలన్ – శాంతి, సంతోషము మరియు ఉత్సాహములలో ; వడిని – త్వరగా ; రోగ, దుర్భిక్ష, దుర్ణయ యోగము + ఏది(యు)న్ – రోగములును, కఱవులును, కుట్రలును మున్నగు ఈతిబాధలే వియు ; చొఱని + అట్లు + ఏలు – ప్రవేశింపకుండునట్లు పరిపాలించు ; జోహరులు – భక్తిపూర్వక నివేదనములు.*

**తాత్పర్యము:** ఓ రామా! పిమ్మట నీవు సీతాలక్ష్మణుల తోడను, సుగ్రీవాంజనే యాది వానరప్రముఖులతోడను కలిసి ప్రశాంతముగా పుష్పకవిమానమెక్కి, అది అయోధ్యానగరము దిశగా ఆకాశములో ఎగురుచున్నప్పుడు, అంతకు ముందు జఱిగిపోయిన వృత్తాంతములు వినోదముగా జ్ఞాపకముచేసికొనుచు నందిగ్రామము దగ్గఱ దిగితివి. అచ్చట మీ సోదరులు తమ వనవాసవేషము లను, జడలను, గడ్డములను విడిచిపెట్టితిరి. మీ రాక గుఱించి విని అయో ధ్యానగరము చాలకాలము తరువాత శాంతిని, సంతోషమును, ఉత్సాహము ను అనుభవించినది. నీవట్లు సీతామహాదేవితో సహా పట్టాభిషిక్తుఁడవై, ప్రజల కు రోగాది ఈతిబాధలేవియు సోఁకకుండ చిరకాలము రాజ్యపాలనము చేసి తివి. అట్టి నీకు జోహారులు స్వామీ !

**కం. మాలోని పాపపుంజము**



**లీలన్ బోకార్చునట్టి । నీ గుణమెంచన్**
**జాలినవారము కాము ర**
**మాలోకితవదనపద్మ । మహిమారామా !** **115**

***లఘుటీక***: *పాపపుంజమున్ – పాపముల ప్రోవును : లీలన్ – తేలికగా ; పోకా ర్చునట్టి – పోఁగొట్టునట్టి : నీ గుణము– నీ తత్త్వమును ; ఎంచన్ – అంచనా వేయుటకు ; చాలినవారము కాము – చేతనైనవారము కాము ; రమా – లక్ష్మీ దేవి చేత ; +ఆలోకిత – సర్వదా చూడఁబడెడి ; వదనపద్మ – పద్మము వంటి ముఖము యొక్క ; మహిమా – మాహాత్మ్యము గలవాఁడా !*

**తాత్పర్యము:** ఓ రామా! నీ దివ్యతత్త్వమును మననము చేసినంతనే మాలోని పాపరాశి భస్మమగును కదా ! అంతటి మహానుభావుఁడ వైన నీ గుణదోషము లను విచారించు యోగ్యత మాకు లేదులెమ్ము దేవా !

**కం. లలితకృపాసింధువవై**
**చెలంగు నిన్నెప్పుడు మఱ। చెదమో నాడే**
**తొలఁగును సర్వశుభంబులు**
**విలసత్కౌస్తుభమరీచి । విసరా ! రామా !** **116**

***లఘుటీక***: *లలిత – మార్దవముఁ గలిగిన ; కృపా – దయ అనెడి ; సింధువవై – సముద్రమవై ; చెలంగు – విలసిల్లు ; నాఁడే – ఆనాఁడే ; విలసత్ – (ఱొమ్ము మీఁద) విరాజిల్లుచున్న ; కౌస్తుభ – కౌస్తుభమను దివ్యరత్నము యొక్క ; మరీచి – వెలుఁగుల ; విసరా – గుంపు గలిగినవాఁడా !*

**తాత్పర్యము:** ఓ రామా! మా మొఱ వినిపించుకొను మార్దవము గల కరుణా

సముద్రుఁడవు నీవే. అట్టి నిన్ను మేమెప్పుడు మఱచిపోవుదమో (నీ భజన మానివేయుదుమో) అప్పుడే మా జీవితములలో నుండి అన్ని శుభములును, శోభలును నిష్క్రమించును కదా ప్రభూ !

**కం. ఘోరాపారాతుల సం**
**సారాఖ్యామద్యపాన । సాధనచే మా**
**సారంబు సెడెఁ గావున**
**వైరాగ్యౌషధి నొసంగు । వైళమ రామా ! 117**

***లఘుటీక*** : *ఘోర – దారుణమైనదియు ; అపార – ఆవలి దరి లేనటువంటిదియు ; అతుల – సాటిలేనటువంటిదియు నైన; సంసార + ఆఖ్యా – సంసారమను పేరు గల ; మద్యపాన – సారాయిని త్రాగుట ; సాధనచేఁ – అను అలవాటు చేత ; మా సారంబు – మా నిర్మలత్వము ; చెడెఁ – పాడైపోయినది ; కావునఁ – కాఁబట్టి ; ; వైళము – వేగమే ; వైరాగ్య + ఔషధిఁ – వైరాగ్యమను మందు ; ఒసంగు – ఇమ్ము.*

**తాత్పర్యము:** ఓ రామా! సంసారజీవితము సారాయి వంటిది. అది ఘోరమైన మత్తులోనికి దించునది. అది కేవలము సారాయి కాదు, సాక్షాత్తు సారాసముద్రమే. ఆ సముద్రమున కావలిగట్టు లేదు. దానికి సాటియు లేదు. అట్టి సారాసముద్రములోనికి దిగి అందులోని సారాయి త్రాగిత్రాగి మా మనశ్శరీర ములు పూర్తిగా పాడైపోయి యున్నవి. కనుక వెంటనే వైరాగ్యమను మందు మా గొంతులో పోసి మాకు చికిత్సచేయుము స్వామీ !



**కం. వలదెట్టి వివాదంబును**
**వలవవు నైజపరదోష । వర్గోద్ఘోషల్**
**విలయానంతరమైనను**
**నిలిచెడి పరతత్త్వవిద్య । నిమ్మో రామా ! 118**

***లఘుటీక*** : *వలవవు– (వలదు అనుటకు బహువచనము); నైజ– తన యొక్క ; (మఱియు) పర – ఇతరుల యొక్క ; దోష – తప్పుల ; వర్గ – గుంపును గూర్చి ; ఉత్+ఘోషల్ – పైకి బిగ్గఱగా చాటుటలు : విలయ + అనంతరము + ఐనను– ప్రళయమునకు తరువాత కూడ ; పరతత్త్వవిద్యఁ– పరబ్రహ్మమును గూర్చిన జ్ఞానమును.*

**తాత్పర్యము:** ఓ రామా! (పరతత్త్వ యథార్థము ఇదమిత్థమని తెలియకుండ) మాలో మాకు వివాదములేల ? అవి మాకు వలదు. (ఎవటికిని పరిపూర్ణత లేనప్పుడు) ఒకటి తప్పుల నొకఱు బిగ్గఱగా నుగ్గడించి ఆక్షేపించుకొనుట ఏల ? అదియు మాకు వలదు. మాకు వలసినది – ప్రళయకాలము తరువాత కూడ మాతో నిలిచియుండఁగల శాశ్వతమైన పరతత్త్వవిద్య. అదియే మాకిమ్ము.

**కం. తాడేపల్లికులోద్భవుఁ**
**డీడిత హారీతగోత్రుఁ । డిటు నీ చరితన్**
**బాడెను బుధకోటి స్తవన**
**మాడంగను బాలసుబ్ర । మణ్యుఁడు రామా ! 119**

***లఘుటీక*** : *బుధకోటి – పండితబృందములు ; స్తవనమాడంగను – పొగడిత చేయునట్లుగా ; తాడేపల్లికుల – తాడేపల్లి అను వంశమునందు; ఉద్భవుఁడు*

*– పుట్టినవాఁడు ; ఈడిత – ప్రశస్తమైన ; హారీత – హారీతుఁడను ప్రాచీన ఋషి యొక్క; గోత్రుఁడు – గోత్రప్రవరలు గలవాఁడు; బాలసుబ్రమణ్యుఁడు – లలితాబాలసుబ్రహ్మణ్యమను పేరుగల కవి; ఇటు– ఇట్టుల (ఈ విధముగా) ; నీ చరితన్ – నీ చరిత్రమును గూర్చి ; పాడెను – పద్యములల్లెను.*

**తాత్పర్యము:** ఓ రామా! హారీతగోత్రుఁడైన తాడేపల్లి లలితాబాలసుబ్రహ్మణ్య కవి ఈ విధముగా నీ చరిత్రమును గూర్చి ఒక పద్యకృతిని రచించెను.

**కం. హృదయంబుననే మనుజులు**
**త్వదేకనిష్ఠ మెయిఁ బ్రతి ది । వసమును దీనిన్**
**జదువుదురో వారి దొసఁగులు**
**విదిలిచి తముల గములు నెఱ । వేర్పుము రామా !** **120**

***లఘుటీక*** *: ఏ మనుజులు – ఏ మానవులు ; ప్రతిదివసమును – ప్రతిరోజును ; త్వత్+ఏక నిష్ఠ మెయిన్– నీయందే నిలకడ గలిగి ; దీనిని– ఈ పుణ్యగానమును ; హృదయంబునన్ – మనస్సులో ; చదువుదురో – చదువుకొందురో ; వారి దొసఁగులు – వారి పాపములను ; విదిలిచి – తొలఁగఁద్రోసి ; తముల గములు – కోరికల గుంపులను ; నెఱవేర్పుము – తీర్పుము.*

**తాత్పర్యము:** ఓ రామా! ఎవరైతే ప్రతిరోజును నీయందే మనస్సునిలిపి ఈ కృతిని పారాయణము చేసెదరో, వారి పాపములను పోఁగొట్టి, వారి కోరికలను తీర్పవలసినది.



**కం. శ్రీరామశతక మనఁగా**
**గారవమును బొందు పుణ్య । గాన కృతిని నా**
**కూఱిమి కొలఁదిగఁ జేసితిఁ**
**జేఱుఁ ద్వదర్పితముగ నిది । జేజే రామా !** **121**

***లఘుటీక*** *: శ్రీరామశతకము + అనఁగాన్ – శ్రీరామశతకమను పేరుతో ; గారవమును బొందు– గౌరవమును పొందు; పుణ్యగానకృతిని– పుణ్యగానమను ఈ కవితాగ్రంథమును ; నాకూఱిమి కొలఁదిగన్ – నా భక్తి మేరకు ; చేసితిన్ – వ్రాసితిని ; ఇది – ఈ కావ్యము ; త్వత్ + అర్పితముగన్ – నీకు అంకితముగా ; చేఱున్ – (నీకు) చెందును.*

**తాత్పర్యము:** ఓ రామా! **'పుణ్యగానము'** అని నామాంతరము గల ఈ శ్రీరామ శతకమును నా భక్తి మేరకు వ్రాసితిని. ఇది నీకే అంకితము.

